# సింపుల్ హిందీ స్పీకింగ్ కోర్స్



మీకు తెలుగు వస్తే చాలు ...
ఈ కోర్స్ ద్వారా
హిందీ మాట్లాడవచ్చు.

సరస్వతి ఎడ్యుకేషనల్ కమిటీ

# సింపుల్
# స్పోకెన్ హిందీ కోర్స్

## साधारण
# हिन्दी सँभाषणाएँ

సరస్వతి ఎడ్యుకేషనల్ బోర్డ్


శ్రీదేవి పబ్లికేషన్

సత్యనారాయణపురం

విజయవాడ - 520 011

**SIMPLE SPOKEN HINDI COURSE**
by :
Saraswathi Educational Board

First Edition :
September, 1999

Cover Design
**'MULTIMIX'**
Vijayawada-2

Price : Rs. 50/-

Composed on DTP
by **'AKSHARAMALA'**
Vijayawada - 2

Printed at :
**Swami Off-set Printers**
Vijayawada-3

Publishers :
**SRI DEVI PUBLICATION**
Satyanarayanapuram
Vijayawada-11

# విషయ సూచిక
# विषय सूची

# హిందీ - తెలుగు వ్యాకరణ స్వరూపము

తెలుగుభాషా భాషీయులకు హిందీ వ్యాకరణము వ్రాయునపుడు హిందీ మరియు తెలుగు వ్యాకరణముల రూపసామ్యము వీలైనంతవరకు చూడాలి. అలా కానప్పుడు రెండు వ్యాకరణాల త్రోవలు వేరు వేరైపోయి, విద్యార్థులు తికమక పడిపోతారు. అందువలన రెండు భాషలకున్న రూపసామ్యాన్ని, వీలున్నచోట్ల, చూపిస్తూ వుంటాను. అన్ని భాషలలోని సంధులు, సమాసాలు, లింగ వచనాలు వగైరాలు సంస్కృతము యొక్క ఒరవడిలో నడచినవే గాన, భాషలు వేరు తప్ప, విషయాలలో భేదముండదు. అయితే కొన్ని భాషలలో స్త్రీలింగ, పుంలింగ, నపుంసక లింగాలు మూడూ వున్నాయి. కొన్ని భాషలలో నపుంసక లింగము లేదు. హిందీలో నపుంసక లింగము లేదు, తెలుగులో వుంది. అందువలన హిందీలో లింగబాధ ఎక్కువ, తెలుగులో తక్కువ. అలాగే హిందీలో 'నే' ప్రత్యయమున్నది, తెలుగులో లేదు. ఇది కూడా హిందీయేతర భాషల వారికి చికాకు పెడుతూ వుంటుంది. దీనితోపాటు తెలుగులో నపుంసక లింగముండుటచేత భూత కాలపు బాధ తక్కువ, హిందీలో నపుంసకలింగము లేదు గాన భూతకాల నిరూపణ కష్టము. ఇంతకు మినహా, హిందీ భాష ఏ భాష కంటే కష్టమయిన భాష కాదు. ఇలాంటి అపూర్వ విషయాలు అన్ని భాషలలోనూ వుంటాయి. ఇక హిందీ వ్యాకరణము వైపు నడుద్దాము.

# 1. భాగము

# హిందీ అక్షర సమూహాము

దేవనాగరి లిపికి, హిందీ లిపికి భేదము లేదు. ఈ లిపిలో 46 అక్షరము లుంటాయి. అక్షరము అనగా క్షరము (నాశనము) కానిది, ఎల్లప్పుడు ఒకే విధముగా నుండునది యని అర్థము. అ,ఆ,ఇ మొదలైన అచ్చులన్నింటిని అక్షరము లంటాము. వీటి యొక్క సమూహాన్ని అక్షర సమూహము లేదా వర్ణసమూహము (Alphabet) అంటున్నాము. క్రింది 44 అక్షరములు మాత్రము హిందీలో వున్నటువంటివి. అవి అచ్చులు - 11, హల్లులు - 33.

## 2 (1) स्वर (అచ్చులు - Vowels)

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ఏ ఐ ఓ ఔ అం అః

अ आ इ ई उ ऊ ऋ ए ऐ ओ औ अं अः

## 2 (2) व्यंजन (హల్లులు - Consonants)

క ఖ గ ఘ ఙ

क ख ग घ ङ

చ ఛ జ ఝ ఞ

च छ ज झ ञ

ట ఠ డ ఢ ణ

ट ठ ड ढ ण

త థ ద ధ న

त थ द ध न

ప ఫ బ భ మ

प फ ब भ म

య ర ల వ శ ష స హ

य र ल व श ष स ह

(1) **स्वर** (స్వరములు లేక అచ్చులు) - ఇవి మరొక అక్షరము సహాయమును కోరవు. హిందీ భాషలో అచ్చులను స్వరము లంటాము. ఈ అచ్చుల సహాయముతో హల్లు లుచ్ఛరించబడుతాయి. హిందీ భాషలో 11 అచ్చులున్నాయి. ఉదా:-

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ఏ ఐ ఓ ఔ అం అః

अ आ इ ई उ ऊ ऋ ए ऐ ओ औ अं अः

(2) **व्यंजन** (హల్లులు) - ఇవి అచ్చుల సహాయము లేకుండా ఉచ్ఛరించుటకు వీలుకాదు. హల్లులు 33.

క ఖ గ ఘ ఙ  చ ఛ జ ఝ ఞ

क ख ग घ ङ  च छ ज झ ञ

ట ఠ డ ఢ ణ  త థ ద ధ న

ट ठ ड ढ ण  त थ द ध न

ప ఫ బ భ మ  య ర ల వ శ ష స హ

प फ ब भ म  य र ल व श ष स ह

# व्यंजन के वर्ग (హల్లుల సముదాయము)

क ख ग घ ङ  'క' వర్గము

క ఖ గ ఘ ఙ

च छ ज झ ञ  'చ' వర్గము

చ ఛ జ ఝ ఞ

ट ठ ड ढ ण  'ట' వర్గము

ట ఠ డ ఢ ణ

त थ द ध न  'త' వర్గము

త థ ద ధ న

प फ ब भ म  'ప' వర్గము

ప ఫ బ భ మ

**ये स्पर्श वर्ग है।** ఇవి స్పర్శ (త్రాకు) వర్ణములు. అనగా వీటిని ఉచ్ఛరించునపుడు నాలుక అంగిలిని తాకుతుంది - అందువలన వీటిని అంతస్థము లన్నారు.

య ర ల వ

**य र ल व** - అంతస్థములు

శ ష స హ

**श ष स ह** - ఇవి ఊష్మములు. వీటిని ఉచ్ఛరించునపుడు ఒక రకమైన శబ్దము వస్తుంది.

# 3. बारहखडी

## (బారహాఖడీ - గుణింతము)

తెలుగులో మాదిరిగానే హిందీలో కూడా గుణింతా లున్నాయి. గుణింతమును హిందీలో బారహాఖడీ అంటారు. హల్లులకు అనేక రకమైన ఉచ్చారణ లేర్పడుట కొరకు, హల్లులకు అచ్చులను కలుపవలసి యుంటుంది. హల్లులతో అచ్చులు కలసినపుడు, అచ్చులు పొందు మార్పును 'మాత్ర' (గుర్తు) అంటారు. హల్లులతో కలియునపుడు ప్రతి యచ్చునకు ఒక మాత్ర వస్తుంది. హల్లులతో మాత్రలను కలుపడాన్నే బారహాఖడీ (గుణింతము) అంటున్నారు. ఈ భాగములో స్వరములు (అచ్చులు) వాటి గుర్తులు (మాత్రలు) హిందీ గుణింతాలను చూద్దాము.

| | హిందీ అక్షరము | గుర్తు | తెలుగు అక్షరము | గుర్తు |
|---|---|---|---|---|
| 1. | आ | ा | ఆ | ా |
| 2. | इ | ि | ఇ | ి |
| 3. | ई | ी | ఈ | ీ |
| 4. | उ | ु | ఉ | ు |
| 5. | ऊ | ू | ఊ | ూ |
| 6. | ऋ | ृ | ఋ | ృ |
| 7. | ए | े | ఏ | ే |
| 8. | ऐ | ै | ఐ | ై |
| 9. | ओ | ो | ఓ | ో |

| | | | | |
|---|---|---|---|---|
| 10. | औ | ौ | ఔ | ౌ |
| 11. | अ | | అం | ం |
| 12. | अः | : | అః | ః |

क् 'క్' తో చేర్చిన గుణింతము (బారహఖడీ)

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | क् | + | आ | = | का | క్ + ఆ | = | కా |
| 2. | क् | + | इ | = | कि | క్ + ఇ | = | కి |
| 3. | क् | + | ई | = | की | క్ + ఈ | = | కీ |
| 4. | क् | + | उ | = | कु | క్ + ఉ | = | కు |
| 5. | क् | + | ऊ | = | कू | క్ + ఊ | = | కూ |
| 6. | क् | + | ऋ | = | कृ | క్ + ఋ | = | కృ |
| 7. | क् | + | ए | = | के | క్ + ఏ | = | కే |
| 8. | क् | + | ऐ | = | कै | క్ + ఐ | = | కై |
| 9. | क् | + | ओ | = | को | క్ + ఓ | = | కో |
| 10. | क् | + | औ | = | कौ | క్ + ఔ | = | కౌ |
| 11. | क् | + | अं | = | कं | క్ + అం | = | కం. |
| 12. | क् | + | अः | = | कः | క్ + అః | = | కః |

సూచన :- హిందీలో, పొల్లులేని కె,కొ - లు రెండూ వుండవు. ఇలాగే అన్ని గుణింతాలలో పొల్లులేని ఏత్వాలు, ఒత్వాలు ఉండవు. దీర్ఘ ఏత్వాలు, ఓత్వాలే గుణింతాలలో వుంటాయి.

**बारहखडी** (బారహఖడీ) - గుణింతములు

| | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1) | క | కా | కి | కీ | కు | కూ | కృ | కే | కై | కో | కౌ | కం | కః |
| | क | का | कि | की | कु | कू | कृ | के | कै | को | कौ | कं | कः |
| 2) | ఖ | ఖా | ఖి | ఖీ | ఖు | ఖూ | ఖృ | ఖే | ఖై | ఖో | ఖౌ | ఖం | ఖః |
| | ख | खा | खि | खी | खु | खू | खृ | खे | खै | खो | खौ | खं | खः |
| 3) | గ | గా | గి | గీ | గు | గూ | గృ | గే | గై | గో | గౌ | గం | గః |
| | ग | गा | गि | गी | गु | गू | गृ | गे | गै | गो | गौ | गं | गः |
| 4) | ఘ | ఘా | ఘి | ఘీ | ఘు | ఘూ | ఘృ | ఘే | ఘై | ఘో | ఘౌ | ఘం | ఘః |
| | घ | घा | घि | घी | घु | घू | घृ | घे | घै | घो | घौ | घं | घः |
| 5) | చ | చా | చి | చీ | చు | చూ | చృ | చే | చై | చో | చౌ | చం | చః |
| | च | चा | चि | ची | चु | चू | चृ | चे | चै | चो | चौ | चं | चः |

6) ఛ ఛా ఛి ఛీ ఛు ఛూ ఛృ ఛే ఛై ఛో ఛౌ ఛం ఛః
छ छा छि छी छु छू छृ छे छै छो छौ छं छः

7) జ జా జి జీ జు జూ జృ జే జై జో జౌ జం జః
ज जा जि जी जु जू जृ जे जै जो जौ जं जः

8) ఝ ఝా ఝి ఝీ ఝు ఝూ ఝృ ఝే ఝై ఝో ఝౌ ఝం ఝః
झ झा झि झी झु झू झृ झे झै झो झौ झं झः

9) ట టా టి టీ టు టూ టృ టే టై టో టౌ టం టః
ट टा टि टी टु टू टृ टे टै टो टौ टं टः

10) ఠ ఠా ఠి ఠీ ఠు ఠూ ఠృ ఠే ఠై ఠో ఠౌ ఠం ఠః
ठ ठा ठि ठी ठु ठू ठृ ठे ठै ठो ठौ ठं ठः

11) డ డా డి డీ డు డూ డృ డే డై డో డౌ డం డః
ड डा डि डी डु डू डृ डे डै डो डौ डं डः

(మిగతా గుణింతాలన్నీ పై మాదిరిగానే వుంటాయి.)

12) ర రా రి రీ రు రూ రృ రే రై రో రౌ రం రః
र रा रि री रु रू रृ रे रै रो रौ रं रः

13) హ హా హి హీ హు హూ హృ హే హై హో హౌ హం హః
ह हा हि ही हु हू हृ हे है हो हौ हं हः

'ల' గుణింతము నుండి 'స' గుణింతము వరకు 'క' గుణింతము మాదిరే

కొన్ని సంయుక్తాక్షరములు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1) | క+ర | - | క్ర | - | क+र | – | क्र |
| 2) | ఖ+ర | - | ఖ్ర | - | ख+र | – | ख्र |
| 3) | గ+ర | - | గ్ర | - | ग+र | - | ग्र |
| 4) | త+ర | - | త్ర | - | त+र | - | त्र |
| 5) | ద+ధ | - | ద్ధ | - | द+ध | - | द्ध |
| 6) | ద+భ | - | ద్భ | - | द+भ | - | द्भ, द्‌भ |
| 7) | ద+మ | - | ద్మ | - | द+म | - | द्म |
| 8) | ద+య | - | ద్య | - | द+य | - | द्य |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 9) | ద+వ | - | ద్వ | - | द+व | - | द्व | |
| 10) | ర+క | - | ర్క | - | र+क | - | र्क | |
| 11) | ర+గ | - | ర్గ | - | र+ग | - | र्ग | |

(ఇలా 'ర'కు వచ్చు ఒత్తులన్నింటికి 'ర' కారము కొరకు అక్షరముల పైన పైవిధముగా రేఫ వస్తుంది)

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 12) | శ+ర | - | श+र | - | శ్ర | - | श्र |
| 13) | హ+న | - | ह+न | - | హ్న | - | ह्न |
| 14) | హ+మ | - | ह+म | - | హ్మ | - | ह्म |
| 15) | హ+య | - | ह+य | - | హ్య | - | ह्य |
| 16) | హ+ర | - | ह+र | - | హ్ర | - | ह्र |
| 17) | హ+ల | - | ह+ल | - | హ్ల | - | ह्ल |
| 18) | హ+వ | - | ह+व | - | హ్వ | - | ह्व |

(మిగతా వత్తులన్నీ 'క'కు 'క' వత్తులలాగే వుంటాయి. అనగా क्क (క్క)లాగా వుంటాయి. చాలా వత్తులు మొదటి అక్షరములోని నిలువు గీతను (।) తొలగించి తరువాత అక్షరములు పూర్తిగా వ్రాయుట వలన ఏర్పడుతాయి - ఉదా:- ग्ग (గ్గ), च्च (చ్చ), ख्ख (ఖ్ఖ).

# తెలుగు, హిందీ భాషా వ్యాకరణముల స్వరూపము
# (हिंदी और तेलुगु व्याकरण का स्वरूप)

किसी भाषा के पूर्ण ज्ञान के लिए उसके व्याकरण को जानकारी रखना भी आवश्यक हैं। हिंदी मे जो 'ने' विभक्ति हैं, वह तेलुगु मे नही हैं। यह 'ने' को हिंदी मे प्रत्यय कारक कहते हैं, तेलुगु मे इस कारक के स्थान मे 'डु, मु, उ, लु' आते हैं। तेलुगु मे पुंलिंग और स्त्रीलिंग के साथ नपुंसक लिंग भी है। हिंदी में नपुंसक लिंग नही हैं। तेलुगु मे कर्ता के अनुसार क्रिया बदलती हैं, हिंदी में भी 'ने' प्रत्यय कर्ता के साथ न रहने के समय, कर्ता के अनुसार क्रिया बदलती रहती हैं। वर्तमान और भविष्यतकाल मे हिंदी और तेलुगुं के वाक्यों के कर्ता के अनुसार ही क्रियाएँ बदलतीं रहती हैं। भूतकाल में जो सकर्मक कर्म आते हैं, उस समय थोडी

परेशानी उठानी पडती हैं। इसके विषय मे अनुभवियो को कोई परेशानी नहीं है। मगर नये विद्यार्थियों को यह 'ने' प्रत्यय गल्तियो की ओर ले जाता है। हिंदी में सकर्मक और अकर्मक कर्म है। क्रिया को 'किसको' शब्द से प्रश्न करने पर अगर जवाब आता है तो वह सकर्मक और जवाब नहीं आया तो अकर्मक हो जाता है। माने रामने रोटी खायी वाक्य मे की क्रिया को 'किसको खाया ?' वाला प्रश्न करने पर जवाब आयेगा कि रोटी को (రొట్టెను తిన్నాను అని జవాబు వస్తుంది). ऐसा जवाब आनेवाली क्रिया सकर्मक क्रिया होती है। ऐसे ही 'राम कुर्सी पर बैठा' वाले वाक्य मे की क्रिया 'बैठा' के साथ किसको बैठता हैं? (దేనిని కూర్చుంటున్నావు?) वाला प्रश्न करने पर उसका जवाब नहीं आता। तब वह क्रिया अकर्मक क्रिया मानी जाती हैं।

हिंदी में एक ही सर्वनाम में स्थानांतर से अर्थ भेद होने की आवश्यकता हैं। तेलुगु में स्त्रीलिंग केलिए अलग पुलिंग केलिये अलग और नपुंसक लिंग के लिये अलग सर्वनाम है। हिंदी मे इतने सर्वनाम नही हैं। तेलुगु में विशेषण संज्ञा के अनुसार नहीं बदलते। हिंदी में बदल जाते हैं। तेलुगू में तीनों लिंग के लिये अलग-अलग क्रियाएँ हैं । हिंदी मे पुरुषवाचक प्राणियों केलिए पुंलिंगों और स्त्रीवाचक प्राणियो केलिए स्त्रीलिंगों का इस्तेमाल करते हैं, बाकी अप्राणियों की, माने स्थावर वस्तुओ की क्रियाएँ कुछ पुंलिंग और कुछ स्त्रीलिंग, मानी जाती है। इसलिए नये शिक्षार्थी, यह समझ पा रहा है कि कौन सी चीज पुंलिंग है और कौन सी स्त्रीलिंग। यह लिंग की कठिनाई कई ग्रंथों के पढने और कई सज्जनो के मुँह से सुनकर, अनुभव पाने के बाद ही, दूर हो सकती है। दोनों भाषाओं में, संबंध बोधक (సంబంధమును తెలుపు శబ్దాలు) शब्दों के साथ कभी विभक्ती आती है और कभी नही भी आती है। समुच्चय बोधक (రెండు వస్తువులను, మనుష్యులను వగైరాలను కలుపు అవ్యయాలు) अव्यय तेलुगु में ज्यादातर नहीं आते । हिंदी में ज्यादातर आते हैं । तेलुगु में हिदी से अधिक विभक्तियाँ भी हैं। हिंदी भाषा हलंत भाषा है, उस हलंत केलिए नीचे एक लकीर (क्) का चिह्न होता हैं। यह चिह्न जहाँ नहीं होता है, वहाँ स्वरात समझना होगा। तेलुगु में स्वरांत शब्द ही रहते हैं। हलंत नहीं।

(పై హింది భాషకు తెలుగు యనువాదము - ఏ భాషా జ్ఞానము పూర్తిగా పొందాలన్నా, దాని వ్యాకరణాన్ని కూడా తెలిసికొని యుండుటవసరం. హిందీలోనున్న 'నే' ప్రత్యయము

తెలుగులో లేదు. ఈ 'నే' ప్రత్యయాన్ని హిందీలో ప్రథమ కారకమంటారు. ఈ కారకస్థానంలో, తెలుగులో, 'డు,ము,వు,లు' అను విభక్తులొస్తాయి. తెలుగులో స్త్రీ, పుం, నపుంసక లింగాలున్నాయి. హిందీలో నపుంసక లింగము లేదు. తెలుగులో కర్తను బట్టి క్రియ మారినట్లుగానే హిందీలో కూడా క్రియ మారుతుంది గాని; కర్తకు 'నే' ప్రత్యయ మొచ్చినప్పుడు క్రియ కర్మను బట్టి మారుతుంది. ఈ 'నే' ప్రత్యయము వచ్చినప్పుడే, వాక్యనిర్మాణము కొరకు ఎంతో యనుభవ మవసరమవుతున్నది. వర్తమాన, భవిష్యత్తు కాలాల్లో రెండు భాషలలో తేడాలేమీ వుండవు. భూత కాలములో, సకర్మక క్రియలయినపుడు 'నే' ప్రత్యయము తప్పకుండా వస్తుంది, అది వచ్చినప్పుడు కర్మను బట్టి క్రియను మార్చాలను విషయము గుర్తుంచుకోవాలి. అనుభవమున్నవారికి ఈ 'నే' ప్రత్యయము వలన గడబిడ ఏమీ యుండదు. ఈ సకర్మక, అకర్మక క్రియలను తెలిసికోవడానికి ఒక మంచి సూత్రాన్ని ఏర్పరచారు. అదేమంటే, వాక్యములో కర్త, కర్మ, క్రియలున్నప్పుడు, అందులోని క్రియను 'దేనిని' అని ప్రశ్నించాలి. అప్పుడు పండు తిన్నానని గాని, అన్నము తిన్నానని గాని జవాబు వస్తుంది. అపుడు ఆ వాక్యములోని క్రియ సకర్మక క్రియ అవుతుంది. అలా అయినపుడు తప్పకుండా 'నే' ప్రత్యయము కర్త వెంట ఉండి తీరాలి. అకర్మక క్రియ అయినప్పుడు ప్రశ్నకు జవాబుండదు. 'నేను కూర్చున్నాను' అన్నప్పుడు, దేనిని కూర్చున్నావు? ఎవరిని కూర్చున్నావు? అన్న ప్రశ్నలకు జవాబు లుండవు. అలా జవాబులు లేని క్రియలు అకర్మక క్రియలని తెల్పారు. ఆ క్రియలొచ్చినపుడు కర్తకు 'నే' ప్రత్యయము రాదు, అక్కడ కర్తను బట్టియే క్రియ మారుతూ వుంటుంది.

హిందీలో ఒకే సర్వనామము యొక్క అర్థము ఆయాస్థానాలను బట్టి మారుతూ వుంటుంది. తెలుగులో అన్ని లింగాలకు (మూడు లింగాలకు) వేరు వేరు సర్వనామాలున్నాయి. హిందీలో సర్వనామాలు తెలుగులో వున్నన్ని లేవు. తెలుగులోని విశేషణాలు నామవాచకములను బట్టి మారవు. హిందీలో మారిపోతాయి. తెలుగులో మూడులింగాలకు వేరు వేరు క్రియలున్నాయి, హిందీలో అలా లేవు. జంగముల (కదలునవి) లోని పురుష వాచకములకు పుంలింగము, స్త్రీ వాచకములకు స్త్రీలింగము వాడుట జరుగుతుంది. మిగతా స్థావరముల (కదలనివాటి) వద్దనే లింగములను గురించిన పెద్ద చిక్కు. ఈ స్థావర వస్తువులకు హిందీలో కొన్ని స్త్రీలింగాలుంటాయి. కొన్ని పుంలింగాలుంటాయి. ఈ సమస్యా పరిష్కారానికి అనుభవజ్ఞులు కూడా అనుమానములో పడిపోతుంటారు. అయితే, అనుభవజ్ఞులకు, అనుభవలేని వారికున్నంత బాధ యుండదు. వీటిని గురించి బాగా గుర్తుంచుకోవాలంటే అనేక గ్రంథాలు చదువాలి,పెద్దలవద్ద తెలిసికొంటూ వుండాలి, బాగా అలవాటు పడాలి. సంబంధ బోధకాలు (రెండు వస్తువుల లేదా యిద్దరు వ్యక్తుల

సంబంధాలను తెలుపు శబ్దాలు) రెండు భాషలలో సమానంగానే వుంటాయి. అయితే ఈ సంబంధ బోధకములయిన 'లేకుండా, కారణాన, వరకు, లోపల, దగ్గర' మొదలైన శబ్దాలతో తెలుగులో ఒకప్పుడు విభక్తి వస్తుంది, కొన్ని సమయాలలో రాకుండా కూడా వుండడము జరుగుతుంది. సముచ్చయ బోధకములయిన 'మరియు, లేక, ఎందుకంటే, ఇందుచేత, అయినప్పటికి' మొదలైన శబ్దాలు తెలుగులో ఎక్కువగా ఉపయోగించ బడవు, హిందీలో ఎక్కువగా ఉపయోగింపబడుతాయి. తెలుగులో హిందీలో కంటే విభక్తు లెక్కువకూడాను.

హిందీ హలంతభాష. అది హలంత మని తెలియడానికి అక్షరము క్రింద ఒక గీతను (क् - క్) గుర్తుకు ఉంచుతారు. ఈ చిహ్నము లేనప్పుడు స్వరాంతమని (చివర అచ్చు అని) తెలిసిపోతుంది. తెలుగులో అన్నీ స్వరాంత (అచ్చులు చివరనుండు) శబ్దాలే, హలంత (హల్లులు చివరిలోనుండు) శబ్దాలుండనే యుండవు.

# భాషా భాగములు (Parts of Speech)

మనము మాట్లాడునపుడు గాని, వ్రాసేటపుడప్పుడు గాని, మన మనస్సులలోని భావాలను వాక్యాలలో చెప్తాము. పదముల కలయికతో వాక్యము లేర్పడుతాయి. అవి చేయు పనిని బట్టి పదాలను ఎనిమిది రకాలుగా విభజించారు.

ఏ భాషలోనయినా ఈ ఎనిమిది రకముల శబ్ద భేదాలుంటాయి. వ్యాకరణము ద్వారా యితర భాషలను నేర్చుకొనుటకు ఈ శబ్ద భేదాలు బాగా తెలిసి కొనియుండడ మవసరము. ఇప్పుడు ఆ భాషా భాగములను వేరు వేరుగా వివరించిన యెడల, క్రొత్తగా హిందీ నేర్చుకొనువారికి ఎంతో ఉపయోగకారులవుతాయి. ఈ ఎనిమిది భాగములు క్షుణ్ణంగా తెలిసికొనని వారికే భాషా వంటబట్టదు.

### I. संज्ञा (నామవాచకము - Noun )

**किसी व्यक्ति, वस्तु या भाव के नाम को बतानेवाले शब्दों को संज्ञा कहते हैं। संज्ञा में रहनेवाले सारे शब्द बदलते हैं। अतः इन्हें विकारी (बदलनेवाले) शब्द कहते हैं।**

(ఒక వస్తువు, వ్యక్తి, లేదా భావము యొక్క పేరును తెలియజేయు శబ్దాలను నామవాచకము లంటాము. నామవాచక శబ్దాలన్ని మార్పులు చెందుతూ వుంటాయి. అందువలన వీటిని వికారీ శబ్దాలంటారు.)

తెలుగు నామవాచకములో కర్తరి ప్రయోగ సమయములో, కర్తకు 'డు,ము,వు,లు,'

అను విభక్తులు చేర్చబడుతాయి. నామవాచకములు, రెండు భాషలలోను, ప్రధానమైనవి మూడు. (1) వ్యక్తి వాచకము (2) జాతి వాచకము (3) భావ వాచకము

**(I) व्यक्ति वाचक संज्ञा (Proper Noun)**

जिनसे एक ही व्यक्ति या वस्तु मालूम हो, वे व्यक्ति वाचक संज्ञाएँ हैं।

(ఒక వస్తువును గాని, ఒక వ్యక్తిని గాని తెలుపు నామవాచకములన్నీ వ్యక్తి వాచకములు. ఈ నామవాచకముల ద్వారా ఎన్నో వస్తువులు, ఎందరో వ్యక్తులు స్ఫురణకు రారు. ఒకే వస్తువు వస్తుంది.)

ఉదా:- ఢిల్లీ, గంగానది, దశరథుడు, హిమాలయము మొదలగునవి.

హిందీ -दिल्ली, गंगा, दशरथ, हिमालय आदि।

**(II) जाति वाचक संज्ञा (Common Noun)**

एक जाति के सब पदार्थों की, समान रूप से जानकारी होनेवाले शब्द जाति वाचक संज्ञाएँ हैं। जैसे आदमी, शेर, पहाड, नदी आदि। यहाँ सभी आदमियों, शेरों, पहाडों, नदियो आदि का बोध होता हैं, किसी एक विशेष वस्तु पदार्थ या व्यक्ति का बोध नहीं।

(ఏదో యొక జాతి యొక్క పదార్థము లన్నింటిని, సమానరూపముగా తెలియజేయు నామవాచకములను జాతివాచక నామవాచకము లంటారు - ఇలాంటి సమయములో ఏదో యొక వ్యక్తి, పదార్థము, స్థానము బోధపడదు.

ఉదా:- మనుష్యుడు (आदमी), సింహము (शेर), పర్వతము (पहाड), నది (नदी) మొదలైనవి అనేకము లుంటాయి.

**(III) भाव वाचक संज्ञाएँ**

इन में पदार्थों के धर्म, गुण, दोष, अवस्था, व्यापार, भावना आदि जाने जाते हैं। इन पदार्थों का आकार, रूप आदि कोई नहीं रहता।

उदाहरण :- **मिठास** (తియ్యదనము), **सौंदर्य** (అందము), **नीचता** (నీచత్వము), **लडकपन** (చిన్నతనము), **यौवन** (యౌవనము), **चोरी** (దొంగతనము), **पढाई** (చదువు), **दौड** (పరుగు), **हर्ष** (సంతోషము), **भय** (భయము), **शोक** (దుఃఖము), **रोष** (కోపము) **आदि।**

(భావవాచక నామవాచకముల ద్వారా అన్ని పదార్థముల ధర్మము, గుణము, దోషము,

స్థితి, పని, భావము మొదలైనవి తెలుస్తాయి. ఈ పదార్థములకు రూపాకారము లుండవు, కనుపించవు.)

ఉదా:- యౌవనము(**यौवन**), తియ్యదనము (**मिठास**), అందము (**सौंदर्य**), నీచత్వము (**नीचता**), తెల్లదనము (**सफेदी**), జ్వరము (**ज्वर**), వ్యాకరణము (**व्याकरण**), మెళుకువ (**जागरण**) మొదలైనవి.

ఈ భావవాచక సంజ్ఞలు, జాతివాచక, సర్వనామ, విశేషణ, క్రియ, అవ్యయ శబ్దాలద్వారా ఏర్పడుతాయి. క్రింద యిచ్చు నామ వాచకములు హిందీ, తెలుగుకు సంబంధించినవి-

| **హిందీలో** | **తెలుగులో** |
|---|---|
| (క) **జాతివాచక నామవాచకము - భావవాచకము** | **జాతివాచక నామవాచకము - భావవాచకము** |
| मित्र - मित्रता | మిత్రుడు - మిత్రత్వము |
| मनुष्य - मनुष्यत्व | మనుష్యుడు - మనుష్యత్వము |
| (ఖ) **सर्वनाम के द्वारा -** | **సర్వనామములనుండి -** |
| अहम - अहमत्व, अहंकार | అహమ్ - అహంభావము |
| अपना - अपनापन | తన - స్వంతము |
| (గ) **विशेषण से -** | **విశేషణముల నుండి -** |
| चतुर से चतुराई | చతురతగల నుండి చాతుర్యము |
| मीठा से मिठास | తియ్యని - నుండి తియ్యదనము |
| मोटा से मोटाई | లావైన నుండి లావుతవము |
| बुरा से बुराई | చెడ్డ నుండి చెడుతనము |
| सुंदर से सुंदरता | అందమైన నుండి అందము |
| (ఘ) **क्रिया से** | **క్రియనుండి -** |
| चढना से चढाई | ఎక్కుట నుండి ఎక్కుడు |
| सजाना से सजावट | అలంకరించుట నుండి అలంకారము |
| घबराना से घबराहट | గాబరాపడుట నుండి గాబర(తికమక) |
| चलना से चाल् | నడచుట నుండి నడక |
| दौडना से दौड | పరుగెత్తుట నుండి పరుగు |
| लडना से लडाई | పోట్లాడుట నుండి పోట్లాట |

(ఙ) अव्यय से — అవ్యయము నుండి -

मिथ्या से मिथ्यात्व — బూటకము నుండి బూటకత్వము

यदार्थ से यदार्थत्व — నిజము నుండి నిజాయితీ

# कारक (విభక్తులు)

| हिंदी | తెలుగు |
|---|---|
| कर्ता कारक - ने | డు, ము, వు,లు |
| कर्म कारक - को | ని, ను, కి, కు, లన్, కూర్చి, గురించి |
| करण कारक - से | చేత, చే, తోడ, తో, |
| संप्रदान कारक - को (के लिए, के वास्ते) | కొరకు, కై |
| अपादान कारक - से | వలన, పట్టి, కంటె, నుండి |
| संबंध कारक - का, के, की | కి, కు, యొక్క, లో, లోపల |
| अधिकरण कारक - में, पर | అందు, పైన |

| उदाहरण | ఉదాహరణములు |
|---|---|
| **I कर्ता कारक वाक्य** | **ప్రథమా విభక్తి వాక్యములు** |
| (1) राम ने खाया | రాముడు తినెను. |
| (2) कृष्ण बैठा | కృష్ణుడు కూర్చొనెను. |
| (3) फूल कहाँ है? | పుష్పము ఎక్కడ వున్నది? |
| (4) वस्तु अच्छी है | వస్తువు మంచిది. |
| **II कर्म कारक - वाक्य** | **ద్వితీయా విభక్తి వాక్యములు** |
| (1) राम को बुलाओ | రాముని పిలువండి. |
| (2) पुस्तक को लाओ | పుస్తకమును తీసికొనిరండి. |
| (3) बच्चों को बुलाओ | పిల్లలను పిలవండి |
| (4) उसको कुछ न समझिये | వానిని గురించి లెక్కచేయకండి. |

| | |
|---|---|
| III करण कारक वाक्य | తృతీయా విభక్తి వాక్యములు |
| (1) इससे वह आता है | ఇందుచేత వాడు వచ్చుచున్నాడు. |
| (2) कलम से लिखा | కలముతో వ్రాసెను. |
| (3) उससे कराओ | వానిచే చేయించుము. |
| IV संप्रदान वाक्य | చతుర్థీ విభక్తి వాక్యములు |
| (1) उस को किताब दो – | అతనికి (కొరకు) పుస్తకమునివ్వండి. |
| (2) इस को लाया – | ఇతనికై (కొరకు) తెచ్చాను. |
| V अपादान वाक्य | పంచమీ విభక్తి వాక్యములు |
| (1) उस से नुकसान हुआ | అతని వలన నష్టమొచ్చినది. |
| (2) पेड़ से पत्ता गिरा | చెట్టు నుండి ఆకు రాలింది. |
| (3) राम से बडा है | రాముని కంటె పెద్దవాడు. |
| (4) तुम्हारे करने से काम हुआ | నీవు చేయుట వలన పనయింది. |
| VI संबंध कारक वाक्य | షష్ఠీ విభక్తి వాక్యములు |
| राम का भाई – | రామునికి తమ్ముడు. |
| बूट की पालिश – | బూట్లకు పాలిషు. |
| दशरथ का बेटा – | దశరథుని యొక్క కుమారుడు. |
| घर का चोर – | ఇంటిలోని దొంగ |
| पेट का दर्द – | పొట్టలోని బాధ (నొప్పి). |
| श्रीनिवास के भाई – | శ్రీనివాసుని సోదరులు. |
| दशरथ के बेटे – | దశరథుని యొక్క కుమారులు. |
| VII अधिकरण कारक वाक्य | సప్తమీ విభక్తి వాక్యములు |
| उस के आने में गलती नहीं | వాడు రావడమునందు తప్పులేదు. |
| खाट पर सोया – | మంచమున నిద్రించెను. |
| पेड पर चटा – | చెట్టు మీద ఎక్కెను. |
| घर में है – | ఇంటిలో నున్నాడు. |
| दूध में पानी है – | పాలలో నీళ్ళున్నాయి. |
| चट्टान पर चिडिया है – | రాతి పైన పక్షి యున్నది. |

# लिंग (లింగములు)

हिंदी में दो लिग और तेलुगु में तीन लिग है। तेलुगु में पुरुष पुलिग में और स्त्री स्त्रीलिंग में और शेष प्राणी वाचक एवं अप्राणी वाचक शब्द सभी नपुंसक लिंग मे प्रयोग किये जाते हैं। तेलुगु मे नपुंसक लिगो के शब्द, स्त्रीलिंग एव पुंलिंग के अलग - अलग ज्यादातर नहीं है। उनके नाम के पहले पुरुष या स्त्री का बोध करानेवाले शब्द जोडे जाते है।

(హిందీలో రెండు లింగములు, (స్త్రీలింగ, పుంలింగములు), తెలుగులో మూడు లింగములు (స్త్రీలింగ, పుంలింగ, నపుంసక లింగములు) వున్నాయి. తెలుగులో పురుషులను పుంలింగములో, స్త్రీలను స్త్రీలింగములో చూపుతారు. లోకములో మిగతా ప్రాణివాచక, అప్రాణివాచక శబ్దాలన్ని నపుంసకలింగములలో వాడబడుచున్నాయి. తెలుగులో నపుంసక లింగముల కొరకు, స్త్రీలింగ పుంలింగములో ఎక్కువగా వేరు వేరు శబ్దాలు లేవు. వాటి పేర్లు తెలియడానికి వాటి పేర్లకు ముందు పురుష లేక స్త్రీ వాచక శబ్దాల నుంచడము జరుగుతుంది.

హిందీలో రెండు లింగము లయినందున స్త్రీలను స్త్రీలింగములో, పురుషులను పుంలింగములో ప్రయోగించుటయే గాక, మిగతా ప్రాణి వాచక, అప్రాణి వాచక శబ్దాలను స్త్రీలింగ పుంలింగములలోనే ఉపయోగించడము జరుగుతున్నది. అందువలన స్థావరములలో ఏది పుంలింగమో, ఏది స్త్రీలింగమో తెలిసికోవడము క్రొత్తవారికి చిక్కు సమస్యగా తయారయింది. అనుభవశీలురకు ఈ లింగ సమస్య అంత చిక్కయినదేమీ కాదు. తెలుగులోని క్రియాంతములలో తేడాలుండవు. హిందీలో క్రియలు వేరు వేరుగా వుంటాయి.)

| हिंदी | | తెలుగు |
|---|---|---|
| लडका दौडता है | – | బాలుడు పరుగెత్తుచున్నాడు. |
| लडकी दौडती है | – | బాలిక పరుగెత్తుచున్నది. |
| लडके दौडते है | – | బాలురు పరుగెత్తుచున్నారు. |
| लडकियाँ दौडती हैं | – | బాలికలు పరుగెత్తుచున్నారు. |

पुँलिंग से स्त्रीलिंग बनाने के नियम – పుంలింగ శబ్దములను స్త్రీలింగములుగా మార్చు విధము.

| हिंदी | తెలుగు |
|---|---|
| पुत्र – पुत्री | పుత్రుడు - పుత్రిక |
| बंदर – बंदरी | మగకోతి - ఆడకోతి |
| बाप – माँ | తండ్రి - తల్లి |

# वचन (వచనము)

हिंदी में दो वचन होते हैं। इसी प्रकार तेलुगु में भी दो ही वचन होते हैं। तेलुगु के एक वचन में 'डु,मु,वु' विभक्तियाँ संस्कृत संज्ञाओं के साथ लगाई जाती है 'लु,रु' विभक्तियाँ बहुवचन में लगाई जाती हैं। 'लु' विभक्ति ज्यादा जगह लगाई जाती है और 'रु' विभक्ति बहुत कम लगाई जाती है। जैसे -

(హిందీలో, తెలుగులో కూడా రెండు వచనములే వున్నాయి. తెలుగు ఏకవచనమునకు, సంస్కృత నామవాచకములతో, 'డు, ము, వు' లను విభక్తులు చేర్చుట జరుగుతుంది - 'లు' 'రు' విభక్తులు బహువచన శబ్దములకు మాత్రము చేర్చబడుతాయి. శబ్దములు బహువచనము లయినప్పుడు 'లు' ఎక్కువ చోట్ల కలుస్తుంది. 'రు' మాత్రము చాలా తక్కువ తావులలో కనిపిస్తుంది - ఉదా॥-)

| हिंदी | తెలుగు |
|---|---|
| लडका - लडके | బాలుడు - బాలురు |
| मनुष्य - मनुष्य | మనుష్యుడు - మనుష్యులు |
| पशु - पशु | పశువు - పశువులు |
| गाय - गाएँ | ఆవు - ఆవులు |

(కొన్ని శబ్దాలు ఏకవచన, బహువచనములలో ఒకే మాదిరిగా వుంటాయి. వాటికి విభక్తులు చేరినపుడు మార్పు కనపడుతుంది.

जैसे- ఉదా:- मनुष्यों को (మనుష్యులకు), पशुओं को. ( పశువులకు)

(విభక్తులు లేనప్పుడు मनुष्य = మనుష్యులు, पशु = పశువులు గానే వుంటాయి.)

# सर्वनाम् (సర్వనామము)

तेलुगु में हिंदी की अपेक्षा सर्वनामों के रूप ज्यादा हैं। उत्तम पुरुष (मैं- నేను, हम- మేము) मध्यम पुरुष (तू- నీవు, तुम- మీరు, आप- తమరు) सर्वनाम दोनों भाषाओं में बराबर है। अन्य पुरुष (वह = అది, ఆమె, వాడు, यह = ఇది,ఈమె,వీడు, वे = వారు,అవి, ये = ఇవి, వీరు) में स्त्रीलिंग, पुँलिंग, नपुंसक लिंग और निर्देशक (वह- అ, यह- ఈ, वे- అ, ये- ఈ) वाचक सर्वनाम अलग - अलग हैं। जैसे- ఎలాగంటే -

(తెలుగులో హిందీ భాషలో కంటే సర్వనామ రూపాలెక్కువ వున్నాయి. ఉత్తమ పురుష (నేను, మేము) మధ్యమ పురుష (నీవు, మీరు, తమరు) సర్వనామములు రెండు భాషలలో (ఉత్తమ, మధ్యమ) సమానముగానే వుంటాయి. అన్య పురుష (ఉత్తమ, మధ్యమ పురుషులు కాని యితర సర్వనామములు)లో స్త్రీలింగ, పుంలింగ, నపుంసకలింగ, నిర్దేశము (సూచన)ను తెలియజేయు సర్వనామము లన్నియు వేరువేరుగా ఉంటాయి. ఉదా-

**ఉత్తమ పురుష (उत्तम पुरुष)**

(1) मैं आता हूँ (పుంలింగ క్రియ) - నేను వచ్చుచున్నాను. (పుంలింగము)
(1) मैं आती हूँ (స్త్రీలింగ క్రియ) - నేను వచ్చుచున్నాను. (స్త్రీలింగము)
(2) हम आते हैं (పుంలింగ బహువచన క్రియ) - మేము వచ్చుచున్నాము (పుం.లిం)
(2) हम आती हैं (స్త్రీలింగ బహువచన క్రియ) - మేము వచ్చుచున్నాము. (స్త్రీ.లిం.)
(3) हम आते हैं (పుంలింగ బహువచన క్రియ) - మనము వచ్చుచున్నాము (పుం.లిం.)
(3) हम आती हैं (స్త్రీలింగ బహువచన క్రియ) -మనము వచ్చుచున్నాము (స్త్రీ.లిం.)

**మధ్యమ పురుష (मध्यम पुरुष)**

(1) तू आता है (పుంలింగ ఏకవచన క్రియ) - నీవు వచ్చుచున్నావు. (పుం)
(1) तू आती है (స్త్రీలింగ ఏకవచన క్రియ) - నీవు వచ్చుచున్నావు. (స్త్రీ)
(2) तुम आते हो (పుంలింగ గౌరవసూచక క్రియ) - మీరు వచ్చుచున్నారు. (పుం)
(2) तुम आती ह (స్త్రీలింగ గౌరవసూచక క్రియ) - మీరు వచ్చుచున్నారు. (స్త్రీ)
(3) आप आते हैं (పుంలింగ గౌరవసూచక క్రియ) - తమరు వచ్చుచున్నారు. (పుం)
(3) आप आती हैं (స్త్రీలింగ గౌరవసూచక క్రియ) - తమరు వచ్చుచున్నారు (స్త్రీ)

# 1. अन्यपुरुष एकवचन
# (ప్రధమ పురుష ఏకవచనము)

## निश्चयवाचक सर्वनाम (నిశ్చయమును తెలుపు సర్వనామము)

(1) वह आता है (పుం.లిం.ఏకవచనము) - వాడు లేక అతను వచ్చుచున్నాడు.
(1) वह आती है (స్త్రీ.లిం. ఏకవచనము) - ఆమె లేక ఆవిడ వచ్చుచున్నది.
(2) वह आता है (పుం.లిం. ఏకవచనము) - అది వచ్చుచున్నది. (స్త్రీ.నపుం.ఏక)

(2) वह आती है (స్త్రీ.లిం. ఏకవచనము) - అది వచ్చుచున్నది. (స్త్రీ.నపుం.ఏక).
(3) यह आता है (పుం.లిం. ఏకవచనము) - వాడు వచ్చుచున్నాడు, ఇతను వచ్చుచున్నాడు. (పుం.లిం.ఏకవచనము)
(3) यह आती है (స్త్రీ.లిం.ఏకవచనము) - ఈమె వచ్చుచున్నది, ఈవిడ వచ్చుచున్నది, - స్త్రీలింగ ఏకవచనము)
(4) यह आता है (హిందీలో నపుంలింగ ఏకవచనము) - ఇది వచ్చుచున్నది. (తెలుగులో నపుంసకం)
(4) यह आती है (హిందీలో నపుంలింగ ఏకవచనము) - ఇది వచ్చుచున్నది. (నపుంసకం)

# अन्य पुरुष बहुवचन
## (ప్రథమ పురుష బహువచనము)

(1) वे आते है (పుం) - వారు వచ్చుచున్నారు. (పుం)
(1) वे आती है (స్త్రీ) - వారు వచ్చుచున్నారు. (స్త్రీ)
(2) ये आते है (పుం) - వీరు వచ్చుచున్నారు. (పుం)
(2) ये आती है (స్త్రీ) - వీరు వచ్చుచున్నారు. (స్త్రీ)
(3) वे आते है (పుంలింగ బహువచనము) - అవి వచ్చుచున్నవి. (నపుంసక లింగము)
(3) ये आती है (స్త్రీ లింగ బహువచనము ) - ఇవి వచ్చుచున్నవి. (నపుంసక లింగము)

# अनिश्चयवाचक सर्वनाम एकवचन
## (నిశ్చయము తెలియని ఏకవచన సర్వనామములు)

(1) कोई आता है (పుం.ఏకవచనము) - ఎవడో వచ్చుచున్నాడు (పుం)
(1) कोई आती है (స్త్రీలింగ ఏకవచనము) - ఎవతో వచ్చుచున్నది. (స్త్రీ.లిం.)
(2) कोई आते है (పుం. బహువచనము) ఎవ్వరో(మగవారు) వచ్చుచున్నారు.
(2) कोई आती है (స్త్రీలింగ బహువచనము) ఎవ్వరో (ఆడవారు) వచ్చుచున్నారు.
(3) कोई आता है (పుం. ఏకవచనము) - ఏదో వస్తున్నది (నపుంసకము)
(3) कोई आती है (స్త్రీలింగ ఏకవచనము) ఏదో వస్తున్నది (నపుంసకము)

(4) कोई आते है (పుంలింగ బహువచనం) - ఏవో వస్తున్నాయి. ( నపుం)
(4) कोई आती है (స్త్రీలింగ బహువచనం) - ఏవో వస్తున్నాయి (నపుం)
(5) कुछ आता है (పుం.ఏక) - కొంత వస్తున్నది (నపుంసకము)
(5) कुछ आती है (స్త్రీ.లిం.ఏక) - కొంత వస్తున్నది (నపుంసకము)
(6) कुछ आते है (పుం.బహు) - కొన్ని వస్తున్నాయి (నపుంసకము)
(6) कुछ आती है (స్త్రీ.లిం.బహు) - కొన్ని వస్తున్నాయి (నపుంసకము)

(హిందీ క్రియలలో మార్పు లెక్కువ వున్నందున ఏది, ఏలింగమో తెలిసికొనుట కనుభవమవసరము తెలుగులో నపుంసకలింగ మున్నది గాన ఆ విషయములో మాత్రము తేలికనిపిస్తుంది).

(7) कुछ आते है (పుం.బహు) - కొందరు( మగవారు) వచ్చుచున్నారు. (పుం)
(7) कुछ आती हैं (స్త్రీ.లిం.బహు) - కొందరు(ఆడవారు) వచ్చుచున్నారు. (స్త్రీలింగం)
(8) कुछ आता है (పుం.బహు) - కొంత వచ్చుచున్నది. (నపుంసకము)
(8) कुछ आती है (స్త్రీ.లిం.బహు) - కొంత వచ్చుచున్నది. (నపుంసకము)

# संबंध वाचक सर्वनाम
## (సంబంధమును తెలుపు సర్వనామము)

(1) जो पढेगा, वह पास होगा - చదివినవాడు పాసవుతాడు (పుం)
(1) जो पढेगी वह पास होगी - చదివినావిడ పాసవుతుంది (స్త్రీ)
(2) जो ज्यादा खाता हैं, सो बीमार हो जायेगा - ఎక్కువ తిన్నవాడు జబ్బుపడును. (పుం.)
(2) जो ज्यादा खाती हैं, सो बीमार हो जायेगी -ఎక్కువ తిన్నావిడ జబ్బుపడుతుంది. (స్త్రీ)

# प्रश्नवाचक सर्वनाम – एकवचन
## (ప్రశ్నల తెలుపు సర్వనామము - ఏకవచనము)

1. कौन आता है? (పుం) - ఎవడు వచ్చుచున్నాడు? (పుం)
1. कौन आती है? (స్త్రీ) - ఎవతె వచ్చుచున్నది? (స్త్రీ)

2. कौन आता है? (పుం) - ఏది వచ్చుచున్నది? (నపుంస)
2. कौन आती है? (పుం) - ఏది వచ్చుచున్నది? (నపుంస)
3. कौन आते है? (పుం.బ) - ఎవరు వచ్చుచున్నారు? (పుం.బ)
3. कौन आती है? (స్త్రీ.బ) - ఎవరు వచ్చుచున్నారు? (స్త్రీ.బ)
4. कौन आते है? (పుం.బ) - ఏవి వచ్చుచున్నవి? (నపుం.బ)
4. कौन आती है? (స్త్రీ.బ) - ఏవి వచ్చుచున్నవి? (నపుం.బ)
5. कौन आ रहे है? (పుం.బ) - ఎవరు వచ్చుచూ వున్నారు? (పుం.బ)
5. कौन आ रहा है? (పుం.ఏ) - ఎవడు వచ్చుచూ వున్నాడు? (పుం.ఏ)
6. कौन आ रही है? (స్త్రీ.ఏ) - ఎవతె వచ్చుచూ వున్నది? (స్త్రీ.ఏ)
6. कौन आ रही है? (స్త్రీ.బ) - ఎవర్తెలు వచ్చుచూ వున్నారు (స్త్రీ.బ)
7. कौन आ रहा है? (పుం.ఏ) . - ఏది వచ్చుచూ వున్నది (నపుం.ఏ)
8. कौत आ रहे है? (పుం.బ) - ఏవి వచ్చుచూ వున్నవి? (నపుం.బ)

(ఇలా వర్తమాన, భూత, భవిష్యత్కాలములలో, వాటిలోని అంతర్భాగాలలో. పైవిధంగా రెండు భాషలలో, ఆయా భాషలలో, మార్పులు గమనిస్తూ ముందుకు సాగిపోతూ వుండాలి.)

# निजवाचक सर्वनाम एकवचन

[శ్రోతలు (వినేవారు), వక్తలు (వినిపించువారు) యిరువురను కలుపుకొని ఉపయోగించుకొని పలుకు ఏకవచన సర్వనామము]

1. मैं अपना काम आप करता हूँ (పుం.ఏ).
   నేను నా పని స్వంతముగా చేసికొంటున్నాను. (పుం.ఏ)
1. मैं अपना काम आप करती हूँ (స్త్రీ.ఏ)
   నేను నా పని స్వంతముగా చేసికొనుచున్నాను. (స్త్రీ.ఏ)
2. हम अपना काम आप करते है (పుం.బ)
   మేము మా పనులు స్వంతముగా చేసికొనుచున్నాము. (పుం.బ)
2. हम अपना काम आप करती है (స్త్రీ.బ)
   మేము మా పనులు స్వంతముగా చేసికొనుచున్నాము. (స్త్రీ.బ)
3. तू अपना काम आप करता है (పుం.ఏ)
   నీవు నీ పని స్వంతముగా చేసికొనుచున్నావు. (పుం.ఏ)

3. तू अपना काम आप करती है (స్త్రీ.ఏ)
నీవు నీ పని స్వంతముగా చేసికొనుచున్నావు. (స్త్రీ.ఏ)
4 तुम अपना काम आप करते हो (గౌరవ శబ్దము బహువచనముకాదు)
మీ పని మీరు స్వంతముగా చేయుచున్నారు. (పుం.ఏ)
4. तुम अपना काम आप करती हो (స్త్రీ.ఏ)
మీరు మీ పని స్వంతముగా చేయుచున్నారు. (స్త్రీ.ఏ)
5. आप अपना काम आप करते हैं (పుం.ఏ).
తమంతు తమ పని స్వంతముగా చేసికొనుచున్నారు. (పుం.ఏ)
5. आप अपना काम आप करती है (స్త్రీ.ఏ)
తమరు తమ పనిని స్వంతముగా చేసికొనుచున్నారు. (స్త్రీ.ఏ)
6. वह अपना काम आप करता है (పుం.ఏ)
వాడు (అతను) తన పని తాను చేసికొనుచున్నాడు. (పుం.ఏ)
6. वह अपना काम आप करती है (స్త్రీ.ఏ)
ఆమె (అది) తన పనిని తాను స్వయముగా చేసికొనుచున్నది (స్త్రీ.ఏ)
7. यह अपना काम आप करता है (పుం.ఏ)
ఇతను (వీడు) తన పని తాను స్వయముగా చేసికొనుచున్నాడు. (పుం.ఏ)
7. यह अपना काम आप करती हैं (స్త్రీ.ఏ)
ఈమె (ఇది) తన పని తాను చేసికొనుచున్నది. (స్త్రీ.ఏ)
8. वे अपना काम आप करते है (పుం.బ)
వారు (పురుషులు) తమ పనులు తాము చేసికొనుచున్నారు. (పుం.బ)
8. वे अपना काम आप करती हैं (స్త్రీ.బ)
వారు (స్త్రీలు) తమ పనులు తాము చేసికొనుచున్నారు. (స్త్రీ.బ)
9. वे अपने काम आप करते है (పుం.బ)
అవి తమ పనులు తాము చేసుకొనుచున్నవి (నపుం.బ)
9. वे अपने काम आप करती हैं (స్త్రీ.బ)
అవి తమ పనులు తాము చేసికొనుచున్నవి. (నపుం.బ)
10. ये अँपने काम आप करते हैं (పుం.బ)
అవి తమ పనులు తాము చేసికొనుచున్నవి (నపుం.బ)

10. ये अपने काम आप करती हैं (స్త్రీ.బ)
అవి తమ పనులు తాము చేసికొనుచున్నవి (నపుం.బ)

# సర్వనామముల రూపములు

## 1. पुरुष वाचक - उत्तम पुरुष - मैं
## (పురుష వాచక సర్వనామము - ఉత్తమ పురుష - నేను)

| | | |
|---|---|---|
| कर्ता कारक | - | मैं, मैने (నేను) |
| | | हम, हमने (మేము) |
| कर्म कारक | - | मुझे, मुझ को (నన్ను, నాకు) |
| | | हमें, हमको (మమ్ము, మాకు) |
| करण कारक | - | मुझ से (నాతో, నాచేత) |
| | | हमसे ( మాతో, మాచేత) |
| संप्रदान कारक | - | मुझे, मुझ को (నాకొరకు, నాకై) |
| | | हमें, हमको (మాకొరకు, మాకయి) |
| अपादान कारक | - | मुझ से (నావలన, నాకంటె, నానుండి) |
| | | हम से ( మాకంటె, మానుండి) |
| संबंध कारक | - | मेरी, मेरा, मेरे (నాకు, నాయొక్క, నాలో, నాలోపల) |
| | | हमारा, हमारे, हमारी (మాకు, మాయొక్క, మాలో, మాలోపల) |
| अधिकरण कारक | - | मुझ में, मेझ पर (నాయందు, నాలో) |
| | | हम में, हम पर ( మాయందు, మాలో) |

## 2. पुरुष वाचक (मध्यम पुरुष) तू
## (పురుష వాచక (మధ్యమ పురుష) - నీవు.

| | | |
|---|---|---|
| कर्ता कारक | - | तू, तूने (నీవు) |
| | | तुम, तुमने (మీరు) |
| कर्म कारक | - | तुझे, तुझ को (నిన్ను, నీకు) |
| | | तुम्हे, तुमको (మీకు, మిమ్ములను) |

10. ये अपने काम आप करती हैं (స్త్రీ.బ)

అవి తమ పనులు తాము చేసికొనుచున్నవి (నపుం.బ)

# సర్వనామముల రూపములు

## 1. पुरुष वाचक - उत्तम पुरुष - मैं

## (పురుష వాచక సర్వనామము - ఉత్తమ పురుష - నేను)

कर्ता कारक - मैं, मैने (నేను)

हम, हमने (మేము)

कर्म कारक - मुझे, मुझ को (నన్ను, నాకు)

हमें, हमको (మమ్ము, మాకు)

करण कारक - मुझ से (నాతో, నాచేత)

हमसे ( మాతో, మాచేత)

संप्रदान कारक - मुझे, मुझ को (నాకొరకు, నాకై)

हमें, हमको (మాకొరకు, మాకయి)

अपादान कारक - मुझ से (నావలన, నాకంటె, నానుండి)

हम से ( మాకంటె, మానుండి)

संबंध कारक - मेरी, मेरा, मेरे (నాకు, నాయొక్క, నాలో, నాలోపల)

हमारा, हमारे, हमारी (మాకు, మాయొక్క, మాలో, మాలోపల)

अधिकरण कारक - मुझ में, मेझ पर (నాయందు, నాలో)

हम में, हम पर ( మాయందు, మాలో)

## 2. पुरुष वाचक (मध्यम पुरुष) तू

## (పురుష వాచక (మధ్యమ పురుష) - నీవు.

कर्ता कारक - तू, तूने (నీవు)

तुम, तुमने (మీరు)

कर्म कारक - तुझे, तुझ को (నిన్ను, నీకు)

तुम्हे, तुमको (మీకు, మిమ్ములను)

| | | |
|---|---|---|
| | | ఆమెలకంటే, ఆమెలనుండి, వాటివలన,వాటికంటే, వాటినుండి |
| संबंध कारक | - | **उसका, उसके, उसकी** (వానికి, వానియొక్క, వానిలో, వానిలోపల, ఆమెకి, ఆమెయొక్క, ఆమెలో, ఆమెలోపల దానికి, దానియొక్క, దానిలో, దానిలోపల) |
| | | **उनका, उनके, उनकी** (వారికి, వారియొక్క, వారిలో, వారిలోపల, ఆమెలకి, ఆమెలయొక్క, ఆమెలలో, ఆమెల లోపల, వాటికి, వాటియొక్క, వాటిలో, వాటిలోపల) |
| अधिकरण कारक | - | **उसमें, उसपर** (వానియందు, ఆమెయందు, దానియందు వానిలో, ఆమెలో, దానిలో) |
| | | **उनमें, उनपर** (వారియందు, ఆమెలయందు, వాటియందు వారిలో, ఆమెలలో, వాటిలో) |

## 4. पुरुष वाचक (अन्यपुरुष) निश्चयवाचक - यह
## పురుష వాచకము (ప్రథమ పురుష)
## నిశ్చయ వాచకము - ఇది, వీడు, ఈమె

| | | |
|---|---|---|
| कर्ता कारक | - | **यह, इसने** (ఇది, వీడు, ఈమె) |
| | | **ये** = (ఇవి, వీరు, ఈమెలు) |
| कर्म कारक | - | **इसे, इसको** (దీనిని, వీనిని, ఈమెని) |
| | | **इन्हें, इनको** (వీటిని, వీరిని, ఈమెలని) |
| करण कारक | - | **इससे** (దీనిచేత, దీనితో, వీనిచేత, వీనితో, ఈమెచేత, ఈమెతో) |
| | | **इनसे** (వీటిచేత, వీటితో, వీరిచేత, వీరితో, ఈమెలచేత, ఈమెలతో) |
| सप्रदान कारक | - | **इसको, इसे** (దీనికొరకు, ఇతని కొరకు, ఇతనికై, ఈమెకొరకు, ఈమెకై, దీనికై) |
| इनको, इन्हें | - | (వీరికొరకు, వీరికై, ఈమెల కొరకు, ఈమెలకై, వీటికొరకు, వీటికై) |
| अपादान कारक | - | **इससे, इसको** (వీనివలన, వీనికంటె, వీనినుండి, ఈమెవలన, ఈమెకంటే, ఈమెనుండి, దీనివలన, దీనికంటె, ధీనినుండి) |

इनसे, इनको - (వీరివలన, వీరికంటె, వీరినుండి, ఈమెలవలన, ఈమెలకంటే, ఈమెలనుండి; వీటివలన, వీటికం టే, వీటినుండి)

सबध कारक - **इसका, इसके, इसकी** (వీనికి, వీనియొక్క, వీనిలో; ఈమెకి, ఈమెయొక్క. ఈమెలో; దీనియొక్క, దీనికి, దీనిలో)

**इनका, इनके, इनकी** (వీరికి, వీరియొక్క, వీరిలో: ఈమెలకి, ఈమెలయొక్క, ఈమెలలో: వీటికి, వీటియొక్క, వీటిలో).

अधिकरण कारक - **इसमें, इसपर** (వీనియందు, వీనిమీద, ఈమె యందు, ఈమెమీద, దీనియందు, దీనిమీద)

अधिकरण कारक - **इन में, इनपर** (వీరియందు, వీరిమీద, ఈమెలయందు, ఈమెలమీద, వీటియందు, వీటిమీద)

## 5. पुरुष वाचक (अन्यपुरुष) निश्चयवाचक - आप
## పురుష వాచకము (ప్రథమ పురుష) నిశ్చయవాచకము - తమరు

कर्ता - **आप, आपने** (తమరు)

कर्म - **आप को** (తమని, తమకు, తమలో, తమనిగూర్చి, తమనుగురించి)

करण - **आपसे** (తమచేత, తమచే, తమతో, తమతోడ)

संप्रदान - **आपसे, आपको** (తమకొరకు, తమకై)

अपादान - **आप से** (తమవలన, తమకంటే,తమనుండి)

संबंध - **आपका, आपके, आपकी** (తమకి, తమకు, తమయొక్క తమలో, తమలోపల)

अधिकरण - **आपमें, आप पर** (తమయందు, తమమీద)

**ऊपर के लिखे हुए शब्दों के बहुवचन के पिछे लोग लगाकर भी बोलते हैं।**

(పైన వ్రాసిన శబ్దముల బహువచనముల తరువాత మీరందరు, తమరందరు, మేమందరము, మనమందరము, వీరందరు, వారందరు అని కూడా వ్రాయవచ్చు)

## 6. निजवाचक सर्वनाम - आप

## (నిజవాచక సర్వనామము - తన (స్వంతముగా)

कर्ता - आप (తన స్వంతముగా)

कर्म - अपने को (తనని,తనను, తననుగురించి)

करण - अपने से (తనచేత, తనతో)

संप्रदान - अपने को (తనకొరకు, తనకై)

अपादान - अपना, अपने, अपनी (తనవలన, తనకంటే, తననుండి)

संबंध - अपना, अपने, अपनी (తనకి, తనకు,తనయొక్క, తనలో, తనలోపల)

अधिकरण - अपने में, अपने पर (తనయందు, తనమీద)

## 7. अनिश्चयवाचक सर्नाम - कोई

## (అనిశ్చయవాచక సర్వనామము - ఎవరో, ఎవతో, ఏదో)

कर्ता - कोई, किसीने (ఎవరో,ఎవడో, ఎవతో, ఏదో)

कर्म - किसी को (ఎవనినో, ఎవరినో, ఎవని గురించియో, ఎవరిని గురించియో)

करण - किसी से (ఎవరి చేతనో, ఎవని చేతనో, ఎవని గురించియో)

संप्रदान - किसी को (ఎవని కొరకో, ఎవరి కొరకో, దేని కొరకో)

अपादान - किसी से (ఎవని వలననో, ఎవని నుండియో, ఎవరి నుండియో, ఎవరి వలననో)

संबंध - किसी का, किसी के, किसी की (ఎవని యొక్కయో, ఎవనిలోనో)

अधिकरण - किसी में, किसी पर (ఎవని యందో, ఎవరిమీదో)

## 8. प्रश्नवाचक सर्वनाम - कौन

## (ప్రశ్నను తెలుపు సర్వనామము - ఎవరు, ఎవతె, ఏది)

कर्ता - कौन, किसने (ఎవరు, ఎవతె, ఏది?)

कर्म - किसको, किसे (ఎవరిని, ఎవరిని గురించి, ఎవతెను, ఎవతెను గురించి)

करण - किससे, किनसे, किसको (ఎవనిచేత, ఎవరిచేత, ఎవనితో, ఎవనితోడ)

संप्रदान - किसको, किसे (ఎవని కొరకు, ఎవనికై, ఎవతె కొరకు, దేని కొరకు?)

किनको - किन्हें (ఎవరి కొరకు, ఎవరికై, ఎవర్తెల కొరకు, వేటి కొరకు)

अपादान - किससे, किसे (ఎవని వలన, ఎవని కంటె, ఎవని నుండి, ఎవతె వలన, ఎవతెకంటే, ఎవతెనుండి, దేని వలన, దేనికంటే, దేనినుండి)

किनसे (ఎవరి వలన, ఎవరికంటే, ఎవరినుండి; ఎవర్తెల వలన, ఎవర్తెలకంటె, ఎవర్తెలనుండి, వేటి వలన, వేటినుండి, వేటికంటే)

संबंध - किसका, किसके, किसकी (ఎవనికి, ఎవనియొక్క, ఎవనిలో)

किनका, किनके, किनकी (ఎవరికి, ఎవరి యొక్క, ఎవరిలో)

अधिकरण - किसमें, किस पर (ఎవరియందు, ఎవరిమీద)

ఇలా సర్వనామా లెన్నోరకాలున్నాయి. చాలా తక్కువ రూపాలు చూపడము జరిగింది. వీటి యాధారంతో అనుభవము మీద మాత్రమే చాలా ఎక్కువ తెలిసికొను టకు వీలుంటుంది.

# III विशेषण (విశేషణములు)

इसकी परिभाषा, दोनों भाषाओं में बराबर है। मगर हिंदी मे संज्ञा के लिग, वचन के अनुसार विशेषण बदलता है, तेलुगु में नहीं बदलता।

(నామవాచకము యొక్క ప్రత్యేకతను తెలుపు శబ్దములను విశేషణము లనుట రెండు భాషలలో సమానమే. అయితే, హిందీలో విశేషణాలు, నామవాచకముల లింగ, వచనములను బట్టి మారుతూ ఉంటాయి, తెలుగులో ఆ మార్పు వుండదు.)

## गुण वाचक विशेषण

### (గుణమును తెలుపు విశేషణములు)

1. अच्छा लडका (పుం.ఏ) - మంచి పిల్లవాడు. (బాలుడు). (పుం.ఏ)
1. अच्छी लडकी (స్త్రీ.ఏ) - మంచి పిల్ల (బాలిక). (స్త్రీ.ఏ)
2. अच्छे लडके (పుం.బ) - మంచి పిల్లవాండ్రు (బాలకులు) (పుం.బ)
2. अच्छी लडकियाँ స్త్రీ.బ) - మంచి బాలికలు (స్త్రీ.బ).
3. अच्छे सामान (పుం.బ) - మంచి సామానులు. (నపుం.బ)
3. अच्छी चिडियाँ (స్త్రీ.బ) - మంచి పక్షులు (నపుం.బ)

## परिमाण वाचक विशेषण

(తూకములను, కొలతలను తెలుపు విశేషణములు)

1. सेर भर आटा - సేరెడు పిండి.
2. थोडा दूध - కొంచెము పాలు.
3. पेट भर खाना - పొట్టెడు తిండి.

## निश्चित संख्यावाचक विशेषण

(అనుమానము లేకుండా సంఖ్యలద్వారా చూపు విశేషణము)

1. चार गज - నాలుగు గజములు
2. पाँच दिन - ఐదు రోజులు

## अनिश्चित संख्यावाचक विशेषण

(నిశ్చయము తెలియని సంఖ్యలను చూపు విశేషణములు)

1. बहुत लोग - చాలామంది ప్రజలు.
2. कम बालक - తక్కువమంది బాలకులు
3. कुछ आम - కొన్ని మామిడిపండ్లు

(అ) क्रिया बोधक संख्या वाचक विशेषण (పనిని తెలుపునది)

दुसरा घोडा - రెండవ గుఱ్ఱము

(ఆ) गुण बोधक विशेषण (రెట్టింపును తెలుపునది)

दुगुना दाम - రెట్టింపు ధర

(ఇ) संकेत बोधक विशेषण (సూచించు విశేషణము)

वह लडका - ఆ పిల్లవాడు (బాలుడు)

यह लडकी - ఈ పిల్ల (బాలిక)

वे लोग - ఆ ప్రజలు

ये लोग - ఈ ప్రజలు

(ఈ) विभाग वाचक विशेषण (విభజించు విశేషణము)

प्रत्येक लडका - ప్రతిఒక్క పిల్లవాడు (బాలుడు)

प्रत्येक लडकी - ప్రతిఒక పిల్ల (బాలిక)

# क्रिया (క్రియ)

हिंदी और तेलुगु की धातुओ, सामान्य क्रियाओं में फरक हैं। हिंदी में ज्यादातर धातुएँ हलंत (क् = క్) और आकारांत (चल + ना = चलना) होते हैं, बहुत कम धातुएँ ईकारांत (पी = త్రాగు), (छू=త్రాకు), ओकारांत, उकारांत, (सो = నిద్రించు) होते हैं। तेलुगु की बहुत - सी धातुएँ उकारांत ही होते हैं। जैसे -

(హిందీలో ఎక్కువగా ధాతువులు హలంతాలుగా (క్) (బాలక్), ఆకారాంతాలుగా వుంటాయి. చాలా తక్కువ ధాతువులు ఈకారాంత, ఉకారాంత, ఓకారాంతము లుంటాయి. తెలుగులోని చాలా ధాతువులు ఉకారాంతములుగానే వుంటాయి. ఉదా -)

| हिंदी धातुएँ | తెలుగు ధాతువులు |
|---|---|
| चल (చల్) | నడచు |
| जा (జా) | వెళ్ళు |
| पी (పీ) | త్రాగు |
| छू (ఛూ) | త్రాకు |
| सो (సో) | నిద్రించు |
| पढ (పఢ్) | చదువు |

क्रिया का सामान्य रुप - (క్రియ యొక్క మామూలు రూపం)

| हिंदी | | తెలుగు |
|---|---|---|
| चल + ना (చల్+నా) चलना | = | నడచు+ ట= నడచుట |
| जा + ना (జా+నా) जाना | = | వెళ్ళు+ట = వెళ్ళుట |
| पी + ना (పీ+నా) पीना | = | త్రాగు+ట = త్రాగుట |
| छू + ना (ఛూ+నా) छूना | = | త్రాకు +ట = త్రాకుట |
| सो + ना (సో+నా) सोना | = | నిద్రించు + ట = నిద్రించుట |

वर्तमान काल कृदंत रूप - (వర్తమాన కాల కృదంత రూపం)

| | | |
|---|---|---|
| चल + ता (చల్+తా) चलता | = | నడచు + చు = నడచుచు |
| जा + ता (జా+తా) जाता | = | వెళ్ళు + చు = వెళ్ళుచు |

पी + ता (పీ+తా) पीता = త్రాగు + చు = త్రాగుచు

छू + ता (ఛూ+తా) छूता = త్రాకు + చు = త్రాకుచు

सो + ता (సో+తా) सोता = నిద్రించు + చు = నిద్రించుచు

## प्रेरणार्थक क्रिया (ప్రేరణార్థక క్రియ)

चला + ना = चलाना (చలానా) - నడిపించు+ట = నడిపించుట

चला + ता = चलाता (చలాతా) - నడిపించు +చు = నడిపించుచు.

## पूर्वकालिक क्रिया (పూర్వకాలిక క్రియ)

1. चलकर + जाना (చల్‌కర్ + జానా) चलकर जाना (हिंदी)

నడచి + వెళ్ళుట (తెలుగు)

पीकर + सोना (పీకర్ + సోనా) पीकर सोना– (हिंदी)

త్రాగి + నిద్రించుట (తెలుగు)

ఇప్పుడు కాలములు గురించి తెలిసికొన బోవుటకు ముందే కొన్ని చిక్కయిన విషయాలు ముందుగా తెలిసికొనియున్న కాలములు తేలికగా అర్థమవుతాయి. అవి -

(1) ముందు హిందీలోనున్న లింగముల విషయము చెప్తాను. ఇందులో నపుంసక లింగము లేనందున అప్రాణివాచక శబ్దాల లింగములను తెలిసికొనడము యిబ్బందిగా వుంటున్నది. ఈ యిబ్బందుల నెదుర్కొనడానికి కొద్ది విషయాలు గుర్తించాలి.

హిందీలో అప్రాణి వాచక శబ్దాలెన్నో వున్నాయి. అవి అకారాంతాలు, ఇకారాంతాలు, ఈకారాంతాలు, ఉకారాంతాలు మొదలైనవి. వాటిలోనున్న శబ్దాలు ఇకారాలంతాలయితే, స్త్రీలింగములని, మిగిలిన అకారాంత, ఉకారాంతము మొదలైన శబ్దాలన్నీ పుంలింగములని అనుకుంటే, ఈ లింగపు చిక్కు చాలావరకు తొలగిపోతుంది. ఇంకా సమస్య మిగిలియుంటే, అది యనుభవము మీద చక్కబడుతుంది.

(2) 'ने' ప్రత్యయము సంగతి. ఇది భూతకాలములో మాత్రమే వస్తుంది. వాటిల్లో కూడా అపూర్ణ, తాత్కాలిక అపూర్ణ భూతములకు రాదు. సామాన్య, ఆసన్న, పూర్ణ, సందిగ్ధ, హేతుహేతు మద్భూత కాలము లప్పుడే వస్తుంది. అయితే ఇలా రావడము వెనుక ఇంకా కొన్ని నియమాలున్నాయి.

(1) 'ने' ప్రత్యయము వాక్యములోని క్రియ సకర్మక క్రియ అయితేనే వస్తుంది.

(2) ఈ సకర్మక, అకర్మక క్రియలెలా తెలుస్తాయంటే, హిందీలో ఒక నియమము పెట్టారు. పై 5 భూతకాలములలో వచ్చు క్రియలు హిందీలోనయితే. **किसको** (దేనిని, ఎవరిని),

తెలుగులోనయితే దేనిని. ఎవరిని అను ప్రశ్నలు ఆ క్రియలకు వేసినప్పుడు సమాధానము వస్తే సకర్మక క్రియ, రాకపోతే అకర్మక క్రియ. దీనికి రెండు ఉదాహరణలిస్తాను -

(అ) **राम ने खाना खाया** = రాముడు అన్నము తినెను.

ఇప్పుడు మనము హిందీలో ప్రశ్నించినపుడు. **खाया** అనే క్రియను **किसको** అని ప్రశ్నించుతాము. జవాబు వస్తుంది.- **खाना** అని. అలాగే తెలుగులో దేనిని తినెను? అని ప్రశ్న వేస్తే, అన్నము అని జవాబు వస్తుంది. అపుడది సకర్మక క్రియగాన 'ने' ప్రత్యయము రావాలి అని గుర్తుంచుకోవాలి.

(ఆ) ఇంకొక సమస్య వుంది. కర్తకు 'ने' ప్రత్యయము వచ్చినపుడు కర్మ ఏ లింగములో, ఏ వచనములో ఉంటే క్రియ ఆ లింగ, వచనములకు మారిపోతుంది.

ఉదా :- **मैने एक फल खाया** = నేను ఒక పండును తిన్నాను.

**मैने दो फल खाये** = నేను రెండు పండ్లు తిన్నాను.

**मैने एक किताब पढी** = నేను ఒక పుస్తకము చదివాను.

**मैने दो किताबें पढी** = నేను రెండు పుస్తకాలు చదివాను.

ఈ నాలుగు వాక్యములలోనున్న కర్త ఏకవచనమే. అయినా 'నే' ప్రత్యయము వచ్చినందున కర్తను వదలి క్రియ, కర్మను బట్టి మారిపోయింది.

(ఇ) ఇక మూడవ సమస్య చిన్నది. కర్తకు 'ने' ప్రత్యయము వచ్చినప్పుడు కర్మకు 'को' ప్రత్యయము చేర్చితే క్రియ ఎప్పుడూ ప్రథమపురుష, పుంలింగ ఏకవచనములో వుంటుంది. ఎలాగంటే -

**मैनें एक फल को खाया** = నేను ఒక పండును తిన్నాను.

**मैने दो फलो को खाया** = నేను రెండు పండ్లను తిన్నాను.

**मैने एक किताब को पढा** = నేను ఒక పుస్తకమును చదివాను.

**मैने दो किताबों को पढा** = నేను రెండు పుస్తకములను చదివాను.

పై వాక్యములలో కర్మ ప్రక్కన **को** (కో) ప్రత్యయము చేరగానే, నియమ ప్రకారము కర్మను బట్టి మారవల్సిన క్రియ, మారకుండా పుంలింగ, ఏకవచనము ప్రథమ పురుషలో వుండిపోయింది.

(ఈ) ఇక అకర్మక క్రియ సంగతి. ఈ అకర్మక క్రియలకు కూడా ఎవరిని, దేనిని అని తెలుగులో, **किसको** అని హింధీలో ప్రశ్నలు వేసినప్పుడు జవాబు వస్తే 'ने' ప్రత్య యము కర్తకు వస్తుంది. లేకపోతే రాదు. ఈ క్రియలకు ఆ ప్రశ్నలు వేసినపుడు జవాబు రానేరాదు. ఎలాగంటే -

**राम मेज पर बैठा** = రాముడు మేజా బల్లమీద కూర్చున్నాడు.

राम काट पर सोया = రాముడు మంచము మీద నిద్రించాడు.

ఇక్కడ **बैठा** (కూర్చొనెను), **सोया** (నిద్రించెను) అను భూతకాలిక క్రియలు రెండు వచ్చాయి. వాటిని ప్రశ్నించి జవాబు పొందాలి అంటే ఎవరిని కూర్చొ న్నావు? దేనిని కూర్చున్నావు? ఎవరిని నిద్రించావు? దేనిని నిద్రించావు? అది తెలుగు లోను, **किसको सोया, किसको बैठा** అని పై మాదిరిగానే ప్రశ్నించితే జవాబులు రావు. అలా జవాబులు రావడానికి వీలులేని క్రియలన్నీ అకర్మక క్రియలు.

ఇక్కడ ఒక్క విషయము గుర్తుంచుకోవాలి. పూర్ణ వాక్యమయినపుడు, అది సకర్మక క్రియ అయినా, అకర్మక క్రియ అయినా కర్త, కర్మ, క్రియలుంటాయి. అయితే అక్కడి క్రియలను ఎపుడు కూర్చున్నావు? ఎందుకు నిద్రించావు? ఎలా కూర్చున్నావు? ఎలా నిద్రించావు?, లాంటి ప్రశ్నలు మన యిష్టము వచ్చినట్లు వేస్తే, ఏదో యొక జవాబు రానే వస్తుంది. ఇక్కడ 'ने' ప్రత్యయము రావడమా, రాకపోవడమా' అనునది తెలిసికోవాలంటే హిందీ క్రియకు, హిందీ లోనయితే, '**किसको**' అనియు, తెలుగు క్రియకు, ఎవరిని, దేనిని అని మాత్రమే ప్రశ్నించి జవాబు వచ్చేది, రానిది తెలిసికొని 'ने' ప్రత్యయమును నిర్ణయించాలి.

నేను 'ने' ప్రత్యయమును గురించి కొన్ని నియమాలు క్లుప్తంగా చెప్పాను. ముందు భూతకాలమును చూడబోతున్నాము. అపుడు 'ने' ప్రత్యయమును గురించి కొంతవరకయినా వినబుద్ధి, చదువబుద్ధి వేస్తుందనుకుంటాను. ఈ 'ने' ప్రత్యయము భూతకాలములో తప్ప మరే కాలములలోను రాదు. క్రింద కొన్ని అకర్మక, సకర్మక క్రియలిస్తున్నాను.

| సకర్మక క్రియలు | | | అకర్మక క్రియలు | | |
|---|---|---|---|---|---|
| लेना | = | తీసికొనుట | आना | = | వచ్చుట |
| पीना | = | త్రాగుట | जाना | = | వెళ్ళుట. |
| खाना | = | తినుట | लाना | = | తెచ్చుట |
| देना | = | ఇచ్చుట | सोना | = | నిద్రుంచుట |
| गाना | = | పాడుట | पाना | = | పొందుట |
| उडना | = | ఎగురుట | खेना | = | నావను తెడ్డువేసి నడపుట |
| गिरना | = | పడుట | खोना | = | పోగొట్టుకొనుట |
| उठना | = | లేచుట | छूना | = | త్రాకుట |
| जलना | = | మండుట | मरना | = | చచ్చుట |
| दौडना | = | పరుగెత్తుట | बिगडना | = | చెడిపోవుట |
| कटना | = | తెగుట | फटना | = | పగిలిపోవుట |

| | | | | | |
|---|---|---|---|---|---|
| छूटना | = | వదలిపోవుట | खुलना | = | తెరచుకొనుట |
| जागना | = | మేల్కొనుట | खेलना | = | ఆడుట |
| जीना | = | బ్రతుకుట | टूटना | = | విరుగుట |
| डूबना | = | మునుగుట | रोना | = | నాటుట |
| निकलना | = | వెడలిపోవుట | करना | = | చేయుట |
| पहुँचना | = | చేరుట | सीखना | = | నేర్చుకొనుట |
| बिकना | = | అమ్ముడుబోవుట | पढना | = | చదువుట |
| रुकना | = | ఆగుట | लिखना | = | వ్రాయుట |
| रोना | = | ఏడ్చుట | समझना | = | తెలుసుకొనుట |
| लटकना | = | వ్రేలాడుట | सुनना | = | వినుట |
| लुटना | = | దోపిడీపడుట | सीना | = | కుట్టుట |
| लेटना | = | పండుకొనుట | कहना | = | చెప్పుట |
| रहना | = | ఉండుట | फोडना | = | పగులగొట్టుట |
| हँसना | = | నవ్వుట | | | |

# I. काल (కాలములు)

हिंदी और तेलुगु भाषाओं के काल और प्रयोग बराबर हैं। मगर हिंदी के कुछ भूतकालों में 'ने' प्रत्यय आने से क्रिया कर्म के लिंग, वचन के अवुसार बदलती हैं। ईसके साथ साथ हिंदी में कर्ता के साथ 'ने' प्रत्यय आकर कर्म के साथ 'को' प्रत्यय जुडे तो क्रिया हमेशा पुंलिंग, एक वचन, प्रथम पुरुष में रहती हैं। तेलुगु में ऐसी कोई स्थिति नहीं हैं। अतः तेलुगु की क्रिया हमेशा कर्ता के लिंग, वचन के अनुसार ही बदलती हैं। जैसें –

| | | |
|---|---|---|
| मैंने खाना खाया | – | నేను అన్నము తిన్నాను. |
| मैंने दो फल खाये | – | నేను రెండు పండ్లు తిన్నాను. |
| मैंने किताब पढी | – | నేను ఒక పుస్తకము చదివాను. |
| मैंने दो किताबो को पढा | – | నేను రెండు పుస్తకాలను చదివాను. |

పై వాక్యములలో మొదటి వాక్యములో **खाना** (ఖానా) అను కర్మ పుంలింగ

ఏకవచనములో వున్నది గాన క్రియ పుంలింగ ఏక వచనములో వున్నది. రెండవ వాక్యములో రెండు పండ్లను కర్మ బహువచనములోనున్నదిగాన క్రియ, బహువచనములోనికి మారిపోయింది. మూడవ వాక్యములో **एक किताब** (ఒక పుస్తకము) అని వుండడమేగాక, ఆ కర్మ స్త్రీలింగమయినందున క్రియ స్త్రీలింగ ఏకవచనముగా మారినది. నాలుగవ వాక్యములో **दो किताबें** అని రెండు పుస్తకములు అను బహువచనము స్త్రీలింగ కర్మ అయినప్పుడు క్రియ **पढीं** అని చుక్కతో వుండవలసినది; దానికి **'को'** విభక్తి చేరినందున నియమ ప్రకారము ప్రథమపురుష, ఏకవచన, పుంలింగ క్రియగా మారిపోయినది.

క్రియల ఏ రూపముల ద్వారా, అవి వాటంతటవి అవడమో లేక ఇతరుల ద్వారా చేయబడడమో జరిగినప్పుడు, ఆ జరుగుటను కాలములు (Tenses) అని అంటారు.

## सामान्य वर्तमान काल

## (సామాన్య వర్తమాన కాలము)

| | | |
|---|---|---|
| वह पढता है | = | వాడు, అతను చదువుచున్నాడు. |
| वह पढती है | = | ఆమె, అది చదువుచున్నది. |
| मैं पढता हूँ | = | నేను చదువుచున్నాను. (పుం) |
| मैं पढती हूँ | = | నేను చదువుచున్నాను. (స్త్రీ.లిం) |
| हम पढते हैं | = | మేము చదవుచున్నాము (పుం) |
| हम पढती हैं | = | మేము చదువుచున్నాము. (స్త్రీ.లిం) |
| वे, ये पढते हैं | = | వారు, వీరు చదువుచున్నారు (పుం) |
| वे, ये पढती हैं | = | వారు, వీరు చదువుచున్నారు (స్త్రీ.లిం) |
| तू पढता है | = | నీవు చదువుచున్నావు (పుం.లిం) |
| तू पढती है | = | నీవు చదువుచున్నావు (స్త్రీ.లిం) |
| तुम पढते हो | = | మీరు (గౌరవము) చదువుచున్నారు (పుం) |
| तुम पढती हो | = | మీరు (గౌరవము) చదువుచున్నారు (స్త్రీ.లిం) |
| आप पढते हैं | = | తమరు చదువుచున్నారు. (పుం) |
| आप पढती हैं | = | తమరు చదువుచున్నారు. (స్త్రీ.లిం) |

## तात्कालिक वर्तमान काल (తాత్కాలిక వర్తమాన కాలము)

**मैं पढ रहा हूँ** = నేను చదువుచూ ఉన్నాను. (పు)

मैं पढ रही हूँ = నేను చదువుచూ ఉన్నాను. (స్త్రీ)

(మిగతా వాక్యాలన్నీ పై వర్తమాన కాలములో నున్నట్లుగానే पडता అనుచోట पढ रहा, पढ रही అని మార్చితే సరిపోతుంది.

## संदिग्ध वर्तमान काल (సందిగ్ధ వర్తమాన కాలము)

वह पढता होगा = వాడు లేక అతను చదువుచు వుండవచ్చు. (పుం)

मैं पढता हूँगा = నేను చదువుచు వుండవచ్చు. (పుం)

मैं पढती हूँगी = నేను చదువుచు వుండవచ్చు (స్త్రీ.లిం)

वह पढती होगी = ఆమె, చదువుచు వుండవచ్చు (స్త్రీ.లిం)

तुम पढते होगे = మీరు చదువుచు వుండవచ్చు (పుం.లిం)

तुम पढती होगी = మీరు చదువుచు వుండవచ్చు (స్త్రీ.లిం)

(మిగతా వాక్య నిర్మాణ మంతయు పైమాదిరిగానే)

## हेतु हेतु मद्भूतकाल (హేతుహేతుమద్వర్తమానకాలము)

ఈ క్రియ ద్వారా కారణము పూర్తి అయితేనే తప్ప కార్యము పూర్తి కాదని తెలుస్తుంది - ఉదా.

यदि उसने पढा हो तो उसे रहने दो = అతను చదివితే ఉంచుము

यदि उसने पढी हो तो उसे रहने दो = ఆమె చదివితే ఉంచుము

(భూతకాలపు క్రియలు సకర్మకములయి, 'నే' ప్రత్యయములు వస్తే హిందీ వాక్యాలలో ఎక్కువగా మార్పులుండవు.)

## भूतकाल (భూతకాలము)

भूतकाल के छः भेद हैं (1) सामान्यभूत (2) आसन्नभूत (3) पूर्णभूत (4) अपूर्णभूत (5) संदिग्धभूत (6) हेतुहेतुमद्भूत

1. **सामान्य भूत** – భూతకాలమును గురించి నిశ్చయము తెలియజేయని క్రియా రూపాలు సామాన్యభూతకాల క్రియ లనబడుతాయి. అలాంటి క్రియలున్న కాలాన్ని సామాన్య భూత కాల మంటారు. అకర్మక క్రియ నుపయోగించినప్పుడు ఈ కాలమునకు ఉదాహరణలు క్రింది విధముగా వుంటాయి -

मैं आया = నేను వచ్చితిని (పుం.లిం)

| | | |
|---|---|---|
| मैं आयी | = | నేను వచ్చితిని (స్త్రీ.లిం) |
| हम आये | = | మేము వచ్చితిమి (పుం.బ) |
| हम आयी | = | మేము వచ్చితిమి (స్త్రీ లిం.బ) |
| तू आया | = | నీవు వచ్చితివి (పుం.ఏక) |
| तू आयी | = | నీవు వచ్చితివి. (స్త్రీ.ఏక) |
| तुम आये | = | మీరు (గౌరవము) వచ్చితిరి (పుం.) |
| तुम आयी | = | మీరు వచ్చితిరి (స్త్రీ లింగము) |
| आप आये | = | తమరు వచ్చితిరి (గౌరవసూచక పుం.బ) |
| आप आयीं | = | తమరు వచ్చితిరి (గౌరవసూచక స్త్రీ లిం.బ) |
| वह आया | = | వాడు లేక అతను వచ్చెను. (పుం.ఏ) |
| वह आयी | = | ఆమె లేక అది వచ్చినది (స్త్రీ.ఏ) |
| वे आये | = | వారు వచ్చిరి (పుం.బ) |
| वे आयीं | = | వారు వచ్చిరి (స్త్రీ.బ) |
| यह आया | = | వీడు లేక ఇతను వచ్చెను (పుం.ఏ) |
| यह आयी | = | ఈమె లేక ఇది వచ్చెను (స్త్రీ.ఏ) |
| ये आये | = | వీరు వచ్చిరి (పుం.బహు) |
| ये आयी | = | వీరు (స్త్రీలు) వచ్చిరి (స్త్రీ.బ) |

(ఇప్పుడు మరొక సకర్మక క్రియా వాక్యములో 'నే' ప్రత్యయము వచ్చుటెలాగో చూద్దాము).

| | | |
|---|---|---|
| मैंने खाना खाया | = | నేను అన్నము తిన్నాను. (పుం.ఏ) |
| मैंने खाना खाया | = | నేను (స్త్రీ) అన్నము తిన్నాను (స్త్రీ.ఏ) |
| हमने खाना खाया | = | మేము అన్నము తిన్నాము (పుం.బ) |
| हमने खाना खाया | = | మేము (స్త్రీలు) అన్నము తిన్నాము (స్త్రీ.బ) |
| तूने खाना खाया | = | నీవు అన్నము తిన్నావు. (పుం.ఏ) |
| तूने खाना खाया | = | నీవు అన్నము తిన్నావు (స్త్రీ.ఏ) |
| आपने खाना खाया | = | తమరు అన్నము తిన్నారు. (పుం.ఏ) |
| आपने खाना खाया | = | తమరు అన్నము తిన్నారు (స్త్రీ.ఏ) |

वह+ने = उसने खाना खाया = అతను అన్నము తినెను.

| | | |
|---|---|---|
| वह+ने | = उसने खाना खाया | = ఆమె అన్నము తినెను. |
| वे+ने | = उन्होंने खाना खाया | = వారు (పురుషులు) అన్నము తినిరి. |
| वे+ने | = उन्होंने खाना खाया | = వారు (స్త్రీలు) అన్నము తినిరి. |
| यह+ने | = इसने खाना खाया | = ఇతను అన్నము తినెను. |
| यह+ने | = इसने खाना खाया | = ఈమె అన్నము తినెను. |
| ये+ने | = इन्होंने खाना खाया | = వీరు (పురుషులు) అన్నము తినిరి. |
| ये+ने | = इन्होंने खाना खाया | = వీరు (స్త్రీలు) అన్నము తినిరి. |

## స్త్రీలింగపు కర్మ గలిగిన వాక్యరూపము

| | | |
|---|---|---|
| मै ने किताब पढी | = | నేను పుస్తకమును చదివితిని (పుం.ఏ) |
| मैं ने किताब पढी | = | నేను (స్త్రీ)పుస్తకమును చదివితిని (స్త్రీ.ఏ) |
| हम ने किताब पढी | = | మేము (పురుషులు) పుస్తకమును చదివితిమి. |
| हमने किताब पढी | = | మేము (స్త్రీలు) పుస్తకమును చదివితిమి. |
| तूने किताब पढी | = | నీవు (పురుషుడు) పుస్తకము చదివితివి. |
| तूने किताब पढी | = | నీవు (స్త్రీ) పుస్తకమును చదివితివి. |
| तुम ने किताब पढी | = | మీరు (పురుషులు) పుస్తకమును చదివితిరి. |
| तुम ने किताब पढी | = | మీరు (స్త్రీలు) పుస్తకమును చదివితిరి. |
| उसने किताब पढी | = | అతను పుస్తకమును చదివెను. |
| उसने किताब पढी | = | ఆమె పుస్తకమును చదివెను. |
| उन्होंने किताब पढी | = | వారు (పురుషులు) పుస్తకమును చదివిరి. |
| उन्होंने किताब पढी | = | వారు (స్త్రీలు) పుస్తకమును చదివిరి. |
| इसने किताब पढी | = | ఇతను పుస్తకమును చదివెను. |
| इसने किताब पढी | = | ఈమె పుస్తకమును చదివెను |
| इन्होंने किताब पढी | = | వీరు (పురుషులు) పుస్తకమును చదివిరి. |
| इन्होंने किताब पढी | = | వీరు (స్త్రీలు) పుస్తకమును చదివిరి. |

ఇప్పుడు పుంలింగ బహువచన కర్మను ఉపయోగించిన వాక్యములను గమనించండి.

| | | |
|---|---|---|
| मैंने दो फल खाये | = | నేను రెండు పండ్లను తింటిని. (పుం) |
| मैंने दो फल खाये | = | నేను (స్త్రీ) రెండు పండ్లు తింటిని. |

हमने दो फल खाये = మేము (పురుషులు) రెండు పండ్లు తింటిమి.
हमने दो फल खाये = మేము (స్త్రీలు) రెండు పండ్లు తింటిమి.
तूने दो फल खाये = నీవు (పురుషుడు) రెండు పండ్లు తింటివి.
तूने दो फल खाये = నీవు (స్త్రీ) రెండు పండ్లు తింటివి.
तुमने दो फल खाये = మీరు (పురుషులు) రెండు పండ్లు తింటిరి.
तुमने दो फल खाये = మీరు (స్త్రీలు) రెండు పండ్లు తింటిరి.
उसने दो फल खाये = అతను రెండు పండ్లు తినెను.
उसने दो फल खाये = ఆమె రెండు పండ్లు తినెను.
उन्होंने दो फल खाये = వారు (పురుషులు) రెండు పండ్లు తినిరి.
उन्होंने दो फल खाये = వారు (స్త్రీలు) రెండు పండ్లు తినిరి.
इन्होंने दो फल खाये = వీరు (పురుషులు) రెండు పండ్లు తినిరి.
इन्होंने दो फल खाये = వీరు (స్త్రీలు) రెండు పండ్లు తినిరి.

పై విధముగానే ఏమార్పు లేకుండా వాక్యాలుంటాయి. కాని ఆసన్న భూతకాలమున వాక్యాలన్నింటికి చివరన है, పూర్ణ భూతకాలానికి ,సందిగ్ధ భూతకాలానికి होगा, హేతుహేతు మద్భూతకాలానికి यदि-तो లు కలిపితే చాలు. ఉదాహరణలు కొద్దిగా చూడండి.

## आसन्न भूत (ఆసన్న భూతకాలము)

मैंने खाया है = నేను తిని యున్నాను (పుం)
मैंने खाया है = నేను తిని యున్నాను (స్త్రీ)

## पूर्ण भूत (పూర్ణ భూతకాలము)

मैंने खाया था = నేను (పురుషుడు) తిని యుంటిని.
मैंने खाया था = నేను (స్త్రీ) తిని యుంటిని.

## संदिग्ध भूत (సందిగ్ధ భూతకాలము)

मैंने खाया होगा = నేను (పురుషుడు) తిని యుండవచ్చు.
मैंने खाया होगा = నేను (స్త్రీ) తిని యుండవచ్చు.
हेतुहेतुमद्भूत - मैंने खाया होता, तो तुमको कुछ भी बचा होता नहीं - నేను (పురుషుడు) తినియుంటే, నీకేమీ మిగిలియుండేది కాదు.

मैने खाया होता तो तुमको कुछ भी बचा नहीं होता = నేను (స్త్రీ) తిని యుంటే, నీకేమీ మిగిలియుండేది కాదు.

ఇప్పుడు అకర్మక క్రియలతో నున్న వాక్యములను గమనించండి - వీటికి 'దేనిని' అను ప్రశ్న వేస్తే జవాబు రాదు.

| | | |
|---|---|---|
| मैं सोया था | = | నేను (పురుషుడు) నిద్రించి యుంటిని. |
| मैं सोयी थी | = | నేను (స్త్రీ) నిద్రించి యుంటిని. |
| तू सोया था | = | నీవు (పురుషుడు) నిద్రించి యుంటివి |
| तू सोयी थी | = | నీవు (స్త్రీ) నిద్రించి యుంటివి. |
| तुम सोये थे | = | మీరు నిద్రించి యుంటిరి (పురుషులు) |
| तुम सोयी थी | = | మీరు (స్త్రీలు) నిద్రించి యుంటిరి. |
| आप सोये थे | = | తమరు (పురుషులు) నిద్రించి యుంటిరి. |
| आप सोयी थी | = | తమరు (స్త్రీ) నిద్రించి యుంటిరి. |
| वह सोया था | = | అతను నిద్రించి యుండెను. |
| वह सोयी थी | = | ఆమె నిద్రించి యుండెను. |
| वे सोये थे | = | వారు (పురుషులు) నిద్రించి యుంటిరి. |
| वे सोथीं थीं | = | వారు (స్త్రీలు) నిద్రించి యుండిరి. |
| यह सोया था | = | ఇతను నిద్రించి యుండెను. |
| यह सोयी थी | = | ఈమె నిద్రించి యుండెను. |
| ये सोये थे | = | వీరు (పురుషులు) నిద్రించి యుండిరి. |
| ये सोयी थीं | = | వీరు (స్త్రీలు) నిద్రించి యుండిరి. |

(ఇలా అపూర్ణ భూతకాల క్రియలన్నీ వాటివాటి క్రియల అర్థాలనుబట్టి, పై విధము గానే వుంటాయి.)

## भविष्य काल (భవిష్యత్కాలము)

సామాన్య భవిష్యత్తు :-

| | | |
|---|---|---|
| मैं आऊँगा | = | నేను (పురుషుడు) వచ్చెదను. |
| मैं आऊँगी | = | నేను (స్త్రీ) వచ్చెదను. |
| हम आयेंगे | = | మేము (పురుషులు) వచ్చెదము. |
| हम आयेंगी | = | మేము (స్త్రీలు) వచ్చెదము. |
| तू आयेगा | = | నీవు (పురుషుడు) వచ్చెదవు. |

| | | |
|---|---|---|
| तू आयेगी | = | నీవు (స్త్రీ) వచ్చెదవు. |
| तुम आओगे | = | మీరు (పురుషుడు) వచ్చెదరు. |
| तुम आओगी | = | మీరు (స్త్రీలు) వచ్చెదరు. |
| वह आयेगा | = | అతను వచ్చును. |
| वह आयेगी | = | ఆమె వచ్చును. |
| वे आयेंगे | = | వారు (పురుషులు) వచ్చెదరు. |
| वे आयेगी | = | వారు (స్త్రీలు) వచ్చెదరు. |
| यह आयेगा | = | ఇతను వచ్చును. |
| यह आयेगी | = | ఈమె వచ్చును. |
| ये आयेंगे | = | వీరు (పురుషులు) వచ్చెదరు. |
| ये आयेंगी | = | వీరు (స్త్రీలు) వచ్చెదరు. |

## सामान्य विधि (సున్నితమైన ఆజ్ఞ)

| | | |
|---|---|---|
| तू जा | = | నీవు (పురు,స్త్రీ) వెళ్ళు. |
| तुम जाओ | = | మీరు (పురుషులు) వెళ్ళండి. |
| तुम जाओ | = | మీరు (స్త్రీలు) వెళ్ళండి. |
| आप जाइये | = | తమరు (పురుషులు) వెళ్ళండి. |
| आप जाइये | = | తమరు (స్త్రీలు) వెళ్ళండి. |

## परोक्ष विधि (పెత్తనపు ఆజ్ఞ)

| | | |
|---|---|---|
| तू मत जा | = | నీవు (పురుషుడు) వెళ్ళ వద్దు. |
| तू मत जा | = | నీవు (స్త్రీ) వెళ్ళ వద్దు. |
| तुम मत जाओ | = | మీరు (పురుషులు) వెళ్ళ వద్దు. |
| तुम मत जाओ | = | మీరు (స్త్రీలు) వెళ్ళ వద్దు. |
| आप मत जाइये | = | తమరు (పురుషులు) వెళ్ళవద్దు |
| आप मत जाइये | = | తమరు (స్త్రీలు) వెళ్ళ వద్దు. |

## क्रिया विशेषण (క్రియా విశేషణము)

క్రియ యొక్క ప్రత్యేక స్థితిని తెలియజేయు శబ్దములు క్రియా విశేషణా లనబడుతాయి.
ఈ విశేషములు లింగ, వచనముల బట్టి మారవు. ఎలాగంటే -

जरूर आओ (జరూర్ ఆఓ = తొందరగా రమ్ము),

आहिस्ता जाओ (అహిస్తా జాఓ = నెమ్మదిగా వెళ్ళు) మొదలగునవి.

(1) **रीतिकाल क्रिया विशेषण** – **(పద్ధతిని తెలుపు క్రియా విశేషణము)**

धीरे – धीरे आता है (ధీరే ధీరే ఆతా హై) మెల్లమెల్లగా వచ్చుచున్నాడు.

धीरे – धीरे आती है (ధీరే ధీరే ఆతీ హై) మెల్లమెల్లగా వచ్చుచున్నది.

(2) **काल वाचक** – **(కాలమును తెలుపు విశేషణము)**

कभी – कभी आता है = అప్పుడప్పుడు వచ్చుచున్నాడు.

कभी – कभी आती है = అప్పుడప్పుడు వచ్చుచున్నది.

(3) **स्थान वाचक** – **(స్థానమును తెలుపునది)**

किधर जाता है ? – ఎటు వెళ్ళుచున్నాడు?

किधर जाती है ? – ఎటు వెళ్ళుచున్నది?

(4) **परिमाण वाचक क्रिया विशेषण** **(కొలతను తెలుపు క్రియా విశేషణాలు)**

कितना लाता हैं ? – ఎంత తీసికొని వచ్చుచున్నాడు?

कितना लाती हैं ? – ఎంత తీసికొని వచ్చుచున్నది?

(5) **स्वीकारात्मक** **(ఒప్పుకొను లక్షణమున్న విశేషణము)**

तुम हाँ बोलो = మీరు ఒప్పుకొనండి.

तुम ठीक बोलो = మీరు సరిగ్గా మాట్లాడండి.

तुम तो जाओगे = మీరు మాత్రము వెళ్ళుదురు.

तुम ही जाओगे = మీరే వెళ్ళుదురు.

(6) **निषेध वाचक** **(వ్యతిరేకమును తెలుపు క్రియా విశేషణము)**

तुम नहीं जाओ = మీరు వెళ్ళకండి.

तुम मत जाओ = మీరు వెళ్ళవద్దు.

(7) **प्रश्न वाचक** **(ప్రశ్నించు క్రియా విశేషణము)**

क्यों जाता है ? = ఎందుకు వెళ్ళుచున్నాడు?

क्यों जाती है ? = ఎందుకు వెళ్ళుచున్నది?

(8) **हेतु वाचक** **(కారణమును తెలుపు క్రియా విశేషణము)**

वह इसलिए जाता है = అతడు యిందుచేత వెళ్ళుచున్నాడు.

वह इसलिए जाती है = ఆమె యిందుచేత వెళ్ళుచున్నది.

ఇక్కడకు రా, అక్కడకు పో, ఎక్కడకు పోయావు? ఎందుకు పోయావు? ఎప్పుడు పోయావు? మొదలైన అవ్యయాలన్నీ ఆయా క్రియలకు విశేషణాలు. అందువలన వాటిని క్రియా విశేషణాలన్నారు. మరికొన్ని ఉదాహరణలు:-

| | | |
|---|---|---|
| भली–भाँति (భలీ - భాంతి) | = | బాగా |
| भली-भाँति सोता है ( భలీ భాతీ సోతా హై) | = | బాగా నిద్రించుచున్నాడు. |
| जल्दी चलो (జల్దీ చలో) | = | తొందరగా వెళ్ళు |
| थोडा (థోడా) | = | కొంచెము |
| थोडा खाओ (థోడా ఖాఓ) | = | కొంచెము తినండి |
| बहुत (బహుత్) | = | చాలా. |
| जहाँतक (జహాఁతక్) | = | ఎంత వరకు |
| आज (ఆజ్) | = | నేడు. |
| कल (కల్) | = | రేపు, నిన్న. |
| परसों (పరసోం) | = | మొన్న, ఎల్లుండి. |
| पहले (పహలే) | = | ముందు |
| पीछे (పీఛే) | = | వెనుక |
| निदान (నిదాన్) | = | నిధానం |
| आजकल (ఆజ్‌కల్) | = | ప్రస్తుతము |
| सदा (సదా) | = | ఎల్లప్పుడు. |
| सतत् (సతత్) | = | ఎల్లప్పుడు. |
| निरतर (నిరంతర్) | = | ఎల్లప్పుడు. |
| अब (అబ్) | = | ఇప్పుడు |
| तब (తబ్) | = | అప్పుడు |
| जब (జబ్) | = | ఎప్పుడైతే |
| कब (కబ్ | = | ఎప్పుడు. |
| अभी (అభీ) | = | ఇప్పుడే. |
| कभी (కభీ) | = | ఎప్పుడో. |
| तभी (తభీ) | = | అప్పుడే. |
| फिर (ఫిర్) | = | మరల |

| | | |
|---|---|---|
| कभी-कभी (కభీ కభీ) | = | అప్పుడప్పుడు. |
| अबभी (అబ్ భీ) | = | ఇప్పుడు కూడా |
| दिन भर (దినభర్) | = | రోజంతా |
| अन्त मे (అంత్ మేం) | = | చివరలో |
| कब का (కబ్ కా) | = | ఎప్పటిది |
| बार-बार (బార్ - బార్) | = | మాటిమాటికి |
| घडी-घडी (ఘడీ - ఘడీ) | = | ప్రతిక్షణము |
| बहुधा (బహుధా) | = | తరుచుగా |
| प्रतिदिन (ప్రతిదిన్) | = | ప్రతిరోజు |
| यहाँ (యహాం) | = | ఇక్కడ |
| वहाँ (వహాం) | = | అక్కడ |
| जहाँ (జహాం) | = | ఎక్కడైతే |
| आगे (ఆగే) | = | ముందు |
| पीछे (పీఛే) | = | వెనుక |
| ऊपर (ఊపర్) | = | పైన |
| दायें (దాయేం) | = | కుడికి |
| बाये (బాయేం) | = | ఎడమకు |
| बाहर (బాహర్) | = | బయట |
| साथ (సాథ్) | = | వెంట |
| पास (పాస్) | = | దగ్గర |
| दूर (దూర్) | = | దూరముగా |
| सामने (సామ్నే) | = | ఎదురుగా |
| इधर (ఇధర్) | = | ఇటు |
| उधर (ఉధర్) | = | అటు |
| जिधर (జిధర్) | = | ఎటయితే |
| किधर (కిధర్) | = | ఎటు |
| बहुत (బహుత్) | = | చాలా |
| थोडा (థోడా) | = | కొంచెము |

| | | |
|---|---|---|
| बडा (బడా) | = | పెద్ద |
| कम (కమ్) | = | తక్కువ |
| हलका (హల్కా) | = | తేలికగా |
| खूब (ఖూబ్) | = | బాగా |
| कुछ (కుఛ్) | = | కొంచెము |
| जरा (జరా) | = | కొంచెము |
| बिलकुल (బిల్కుల్) | = | పూర్తిగా |
| बस (బస్) | = | చాలు |
| काफी (కాఫీ) | = | చాలినంత, ఎక్కువగా |
| इतना (ఇత్నా) | = | ఇంత |
| उतना (ఉత్నా) | = | అంత |
| धीरे-धीरे (ధీరే - ధీరే) | = | మెల్లమెల్లగా |
| ऐसे (ఐసే) | = | ఇలా |
| वैसे (వైసే) | = | అలా |
| यथा (యథా) | = | ఎలాగైతే |
| तथा (తథా) | = | అలాగ |
| वृथा (వృథా) | = | వృధాగా |
| अचानक (అచానక్) | = | అకస్మాత్తుగా |
| अनायास (అనాయాస్) | = | అప్రయత్నముగా |
| एकाएक (ఏకాఏక్) | = | వెంటనే |
| सहसा (సాహసా) | = | వెంటనే |
| सुखपूर्वक (సుఖపూర్వక్) | = | సుఖంగా |
| शांति से (శాంతి సే) | = | శాంతంగా |
| हँसता हुआ (హంస్తా హువా) | = | నవ్వుతూ |
| मन से (మన్‌సే) | = | మనసారా |
| झटपट (ఝట్‌పట్) | = | వెంటనే |
| निश्चय (నిశ్చయ్) | = | నిశ్చయముగా |
| अवश्य (అవశ్య) | = | తప్పక |

| | | |
|---|---|---|
| ठीक (ఠీక్) | = | సరిగ్గా |
| सचमुच (సచ్‌ముచ్) | = | నిజంగా |
| अलबत्ता (అల్‌బత్తా) | = | సందేహము లేకుండా |
| बेशक (బేశక్) | = | అనుమానం లేకుండా |
| शीघ्रता से (శీఘ్రతా సే) | = | తొందరగా |
| कदाचित (కదాచిత్) | = | బహుశా |
| शायद (శాయద్) | = | బహుశా |
| बहुत करके (బహుత్ కర్‌కే) | = | చాలా వరకు |
| वास्तव से (వాస్తవ్ సే) | = | వాస్తవంగా |
| इसलिए (ఇస్‌లియే) | = | ఇందుచేత |
| अतएप (అత్‌ఏవ్) | = | అందుచేత |
| क्यों (క్యోం) | = | ఎందుకు |
| किसलिए (కిస్‌లియే) | = | ఎందుచేత |
| नहीं (నహీఁ) | = | లేదు, కాదు |
| मत (మత్) | = | వద్దు, వలదు |
| फौरन (ఫౌరన్) | = | వెంటనే |

# संबंध बोधक (సంబంధమును తెలుపునది)

संज्ञा और सर्वनाम के पीछे आकर, उसका वाक्य के अन्य शब्दो से संबंध बताते हैं। अकसर, अव्यय संज्ञा या सर्वनाम के बाद आते हैं, मगर कभी कभी संज्ञा या सर्वनाम के पहले भी मिला देते हैं। जैसे - मेहनत के बिना, बिना मेहनत के (మేహనత్ కే బినా (పరిశ్రమలేకుండా), मारे दुख के (దుఃఖము వలన), दुख के मारे (దుఃఖ కారణంగా), भूख के मारे, मारे भूख के (ఆకలి కారణంగా) - इन वाक्यों में 'बिना, मारे (బినా, మారే) संबंध बोधक अव्यय है- (నామవాచకము, సర్వనామములకు తరువాత వచ్చి, అవి ఇతర శబ్దాలతో సంబంధ మేర్పరచుకొంటుంటాయి. అయితే, ఈ అవ్యయములు (ఎప్పుడూ మారనివి) అప్పుడప్పుడు నామవాచకము, సర్వనామములకు ముందు కూడా ఉపయోగించబడుతాయి. కాని

తెలుగులో అలా ముందు వెనుకలుగా కాక, ఎప్పుడూ శబ్దము తరువాతనే ఈ అవ్యయాలు వస్తుంటాయి. ఎలాగంటే - అన్నము తినకుండా, నిద్రలేని కారణంగా, ఇంటివరకు, ఇంటిలోపల, మొదలైనవి.

**प्रयोग के ढंग से संबंध- बोधक अव्यय दो तरह के होते है-** (1) **संबंध** (సంబంధించిన, కలసిన), **और** (2) **अनुबंध** (నియమబద్ధము) - **क** (ప్రయోగమును బట్టి సంబంధ బోధక్ అవ్యయములు నామవాచకము, సర్వనామముల యొక్క విభక్తులు (ప్రత్యయాలు) తరువాత వస్తుంటాయి. **भीतर** (భీతర్ = లోపల), **समीप** (సమీప్ = సమీపమున), **पास** (పాస్ = దగ్గర), **नजदीक** (నజ్‌దీక్ = దగ్గర), **बराबर** (బరాబర్ = సమానముగా), **पीछे** (పీఛే = వెనుక), **आगे** (అగే = ముందు), **परे** (పరే = తరువాత), **जैसे** (జైసే = ఎలాగంటే), **घर के भीतर** (ఘర్ కే భీతర్ = ఇంటి లోపల), **घर की ओर** (ఘర్ కీ ఓర్ = ఇంటివైపు), **घर के निकट** (ఘర్ కే నికట్ = ఇంటి వద్ద), **घर के पीछे** (ఘర్ కే పీఛే = ఇంటి వెనుక), **घर के आगे** (ఘర్ కే అగే = ఇంటికి ముందు), **घर से परे** (ఘర్ సే పరే = ఇంటి కవతల).

**इन अव्ययों के पहले अकसर संबंध कारक की विभक्तियाँ (का, के ,की, रा, रे, री) आती हैं। किंतु कुछ अव्ययों के पहले हमेशा अपादान की 'से' विभक्ति आती है। माने संबंध कारक अथवा अपादान कारक दोनों का प्रयोग होता है। जैसे–मेरा घर तुम्हारे मकान से परे है** (నాయిల్లు, నీయింటికి అవతలనున్నది). **घर से बाहर, घर के बाहर** (ఇంటికి వెలుపల). (ఈ అవ్యయములకు ముందు తరచుగా సంబంధ కారకముల యొక్క విభక్తులు కా, కే, కీ, రా, రే, రే(యొక్క) వస్తాయి. కాని, కొన్ని అవ్యయములకు ముందు ఎల్లప్పుడు సంబంధ అపాదాన కాలము పంచమీ విభక్తి అయిన 'से= నుండి' యను విభక్తి కూడా వస్తుంది. అనగా సంబంధ, బోధక అవ్యయములు, అపాదాన కారక విభక్తి కూడా వస్తాయి. ఎలాగంటే - నాయిల్లు నీయింటి నుండి అవతల యున్నది, నాయిల్లు నుండి నీ యిల్లు బయట నున్నది. నాయిల్లు నీయింటికి అవతల యున్నది, నీయింటి బయట నాచోటు యున్నది.)

**(ख) अनुबंध संबंध बोधक अव्यय संज्ञा के साथ विभक्तिरहित होकर रुप बदल जाते है जैसे–पर्यंत** (పర్యంత్ = వరకు), **सहित** (సహిత్ = తో), **तक** (తక్ = వరకు).

**कुछ संबोधक शब्दों को और उनके उदाहरण ये है –** (కొన్ని సంబోధక శబ్దాలు, వాటి ప్రయోగాలివి) -

**अव्यय (అవ్యయము) - प्रयोग (ప్రయోగము)**

(1) ओर ( ఓర్ = వైపు) - राम के ओर (రాముని వైపు)
(2) नाई (నాఈ = వైపు) - पंडित की नाई (పండిత్‌కీ నాఈ = పండితునివైపు)
(3) सामने (సామ్‌నే = ఎదురుగా) - राजा के सामने (రాజాకే సామ్‌నే = రాజు ఎదుట)
(4) ऊपर (ఊపర్ = పైన) - घर के ऊपर (ఘర్ కే ఊపర్ = ఇంటిపైన)
(5) नीचे (నీచే = క్రింద) - घर के नीचे (ఘర్ కే నీచే = ఇంటిక్రింద)
(6) पास (పాస్ = దగ్గర) - रानी के पास (రానీ కే పాస్ = రాణి దగ్గర)
(7) निकट (నికట్ = దగ్గర) - आप के निकट (ఆప్ కే నికట్ = తమ వద్ద)
(8) तक (తక్ = వరకు) - दो दिन तक (దో దిన్ తక్ = రెండు రోజుల వరకు)

# VII. समुच्चय बोधक (కలుపునది)

शब्दो, वाक्यांशों अथवा वाक्यों मिलानेवाले अव्ययों को समुच्चय बोधक कहते है - (శబ్దాలను, వాక్యాలను, వాక్యాంశాలను కలుపు అవ్యయాలను సముచ్చయములు (కలుపు శబ్దాలు) అంటాము. ఎలాగంటే - **राम और लक्ष्मण** (రాముడు మరియు లక్ష్మణుడు), **चाहे राम या लक्ष्मण** (రాముడు గాని లక్ష్మణుడు గాని కావాలి), **राम या लक्ष्मण** (రాముడు లేక లక్ష్మణుడు) **वा** (లేక) **या** (లేదా) **अथवा** (లేక) **कि** (ఏమనగా) **नहीं** (లేదు, కాదు) **तो** (అయితే) **इसलिए** (ఇందుచేత) **अतः** (అందువలన) **क्यों कि** (ఎందుకంటే) **यद्यपि** (అయినప్పటికి) **और, एवं, व** (మరియు) **या, वा, अथवा** (లేక, లేదా) **पर, परन्तु, मगर, किंतु** (కాని) **अर्थात्, याने, माने** (అనగా) **मानों** (అన్నట్లు).

# VIII. विस्मयादि बोधक (విస్మయాది బోధకము)

# (Interjections)

विस्मयादिक शब्दों से बोलने वाले के ताज्जुब (ఆశ్చర్యము) शर्म, शोक आदि मनोभाव प्रकट होते हैं। जैसे - वाह, खूब बोला, छीं आदि। (విస్మయాదులను తెలుపు శబ్దముల వలన మాట్లాడు వాని ఆశ్చర్యము, సిగ్గు, శోకము మొదలైన మనోభావములు వెల్లడవుతాయి. ఉదా॥ ఓహో, భలే మాట్లాడావే! ఛీ ఏం పని యిది! అయ్యో,

మొదలైనవి. ఇలా రకరకాల మనోవికారాలను తెలియజేయుట కొరకు రకరకాల అవ్యయములు ప్రయోగింప బడుతూ ఉంటాయి. ఎలాగంటే -)

(1) **हर्षबोधक** (సంతోషమును తెలుపునవి) - **आहा** (అహా), **वाह–वाह** (ఓహో) **धन्य–धन्य** (ధన్యుడను), **शबाश** (మాబాగుంది)

(2) **शोकबोधक** (దుఃఖాన్ని తెలుపునవి) – **आह** (అ), **हाय** (అయ్యో),
**हे कृष्णा** (కృష్ణ కృష్ణా), **हे ईश्वर** (ఓ దేముడో).

(3) **अश्चर्य बोधक** (ఆశ్చర్యమును తెలుపునవి) - **ठीक** (సరే!), **अच्छा** (మంచిది) **जी हाँ** (అలాగే) **आदि**

(4) **तिरस्कार बोधक** (వ్యతిరేకించునవి) - **छी** (ఛీ), **हट** (తొలగిపో), **अरे** (అరే!), **चुप** (నోర్ముయ్) **आदि**

(5) **संबोध बोधक** (సంబోధించునవి) – **अरे** (ఒరే), **अरी** (ఒసే), **ओ** (ఓయ్) **आदि** (మొ॥వి).

(ఈ భాగమును వెనుక వ్రాయడము ఎందుకులే అని నిర్లక్ష్యము చేశాను. అయినా క్రమము తప్పించకూడదని యిక్కడ వ్రాశాను.)

# संधि - సంధులు

**अक्षरों के पास–पास आकर मिल जाने से उन में विकार होता है। अतः उसे 'संधि' कहते हैं। जैसे– राम+अवतार। इस में राम का अन्त अक्षर म्+अ और अवतार का पहला 'अ' मिलकर दीर्घ 'आ' हो गया है। इस परिवर्तन को संधि कहते हैं।**

(రెండు శబ్దాలకు మధ్య + గుర్తుంటుంది. ఈ + కు ముందు శబ్దము చివరి అక్షరము, వెనుకటి శబ్దము యొక్క ముందు అక్షరమును కలిపిన సంధియగును. ఉదా - రామ + అవతారము యను రెండు శబ్దములను కలిపినప్పుడు సంధి (కలిసిపోవుట) జరుగుతుంది. అనగా రామ శబ్దములోని చివరి అక్షరం 'మ' 'అ' అవతారము యను శబ్దములోని ముందు అక్షరము 'అ' ను కలిపిన దీర్ఘ 'ఆ'గా మారిపోతుంది. అప్పుడు రామ + అవతారము యను రెండు శబ్దములు కలిసి రామావతార మవుతుంది. సంధులు మూడు రకాలు (1) స్వర సంధి (2) వ్యంజన సంధి (3) విసర్గ సంధి.

# 1. स्वर-संधि (అచ్చుల సంధి)

दो स्वरों के पास-पास आजाने से जो संधि होती है, उसे स्वर-संधि कहते है। स्वर-संधि के पाँच भेद है - दीर्घ, गुण, वृद्धि, यण, अयादि।

(రెండు అచ్చులు దగ్గర దగ్గరకు వచ్చునప్పుడు జరుగు సంధి (కలయిక)ని స్వరసంధి (అచ్చుల సంధి) అంటాము. ఈ అచ్చుల సంధులు 5 రకములు - దీర్ఘసంధి, గుణసంధి, వృద్ధిసంధి, యణసంధి, అయాదిసంధి.

**दीर्घसंधि** - अगर दो सवर्ण (एक ही जाति के) स्वर पास-पास आने से, दोनों को बदले सवर्ण दीर्घ स्वर हो जाता है - अर्थात् ह्रस्व या दीर्घ अ, इ, उ से परे, अगर ह्रस्व या दीर्घ अ, इ, उ ఆ, ఈ, ఊ हों तो दोनों के स्थान में वही दीर्घ स्वर हो जाता है। जैसे -

(రెండు ఒకేరకమైన అచ్చులు దగ్గర దగ్గర చేరినప్పుడు, ఆ రెండింటికి బదులు, ఆ జాతికి సంబంధించిన దీర్ఘపు అచ్చు వస్తుంది. అంటే, హ్రస్వ అచ్చు రూపములయిన అ, ఇ, ఉ, లేక ఆ, ఈ, ఊ తరువాత, హ్రస్వ అ, ఇ, ఉ లు గాని, దీర్ఘ ఆ, ఈ, ఊ లు ఉన్నట్లయితే, ఆ రెండింటి స్థానములో, అదే జాతికి సంబంధించిన దీర్ఘపు అచ్చు వస్తుంది. సంధులు జరుగుటను గ్రహించుటకు ఎల్లప్పుడు పదాలను విభజించుటకు + (ప్లస్)ను ఉపయోగిస్తాము. ఆ + కు ఇటువైపు, అటువైపు దానికి దగ్గరలో నున్న అచ్చులను దృష్టిలో నుంచుకోవాలి. ఎలాగంటే -)

| | | | | | |
|---|---|---|---|---|---|
| अ+अ, | (అ+అ) | = आ | (ఆ) | = | परम्+अर्थ = परमार्थ (పరమార్థ) |
| अ+आ, | (అ+ఆ) | = आ | (ఆ) | = | रत्न+आकार= रत्नाकर (రత్నాకర్) |
| आ+अ, | (ఆ+అ) | = आ | (ఆ) | = | विद्या+अभ्यास = विद्याभ्यास (విద్యాభ్యాస్) |
| आ+आ, | (ఆ+ఆ) | = आ | (ఆ) | = | महा + आशय = महाशय (మహాశయ్) |
| इ+इ, | (ఇ+ఇ) | = ई | (ఈ) | = | कवि+इन्द्र = कवींद्र (కవీంద్ర) |
| इ+ई= | (ఇ+ఈ) | = ई | (ఈ) | = | कवि+ईश्वर = कवीश्वर (కవీశ్వర్) |
| ई+इ= | (ఈ+ఇ) | = ई | (ఈ) | = | मही + इन्द्र = महीन्द्र (మహీంద్ర) |
| ई+ई | (ఈ+ఈ) | = ई | (ఈ) | = | मही + ईश = महीश (మహీశ) |
| उ+उ | (ఉ+ఉ) | = ऊ | (ఊ) | = | गुरु + उपदेश = गुरुपदेश (గురూపదేశ) |
| उ+ऊ | (ఉ+ఊ) | = ऊ, | (ఊ) | = | सिंधु + ऊर्मि = सिंधूर्मि (సింధూర్మి) |
| ऊ+उ | (ఊ+ఉ) | = ऊ, | (ఊ) | = | वधू + उत्सव = वधूत्सव (వధూత్సవ) |

**गुण संधि** (గుణసంధి) :- अगर अ या आ के आगे इ या ई हो तो, दोनों

मिलकर ए ; उ या ऊ हो तो दोनो मिलकर ओ, और ऋ हो तो दोनों मिलकर अर हो जाता है। जैसे –

గుణసంధి - అ లేక ఆ తరువాత, ఇ లేక ఈ వచ్చినట్టయితే, అవి రెండు కలిసి 'ఏ' గాను,उ+ऊ వచ్చినట్టయితే, అవి రెండు కలిసి 'ఓ' గాను. ఋ వచ్చినట్టయితే, ఆ రెండు కలసి 'అర్' గాను మారిపోతాయి. ఎలాగంటే -)

(1) अ या आ + इ या ई = ए ( అ లేక ఆ + ఇ లేక ఈ = 'ఏ' అవుతుంది.

जैसे (ఎలాగంటే) -

देव + इन्द्र = देवेंद्र (దేవేంద్ర)

महा + इन्द्र = महेन्द्र (మహేంద్ర)

सुर + ईश = सुरेश (సురేశ్)

रमा + ईश = रमेश (రమా +ఈశ)(రమేశ)

(2) अ या आ + उ या ऊ = ओ, (అ లేక ఆ + ఉ లేక ఊ = ఓ, అవుతాయి. ఎలాగంటే –)

वीर + उचित (వీర+ఉచిత) = वीरोचित (వీరోచిత)

नव + ऊढा (నవ + ఊఢ) = नवोढा (నవోఢా)

महा + उत्सव (మహా + ఉత్సవ) = महोत्सव (మహోత్సవ)

(3) आ या आ + ऋ = अर, (అ లేక ఆ + ఋ= అర్) ఎలాగంటే -)

सत्प + ऋषि (సప్త +ఋషి) = सत्पर्षि (సప్తర్షి)

महा + ऋषि (మహా +ఋషి) = महर्षि (మహర్షి)

**वृद्ध संधि** अ या आ के आगे, ए या ऐ हो तो दोनों मिलकर ऐ, और ओ या औ हो तो दोनों मिलकर 'औ' हो जाते हैं। जैसे –

వృద్ధి సంధి - అ లేక ఆ కు తరువాత, ఎ లేక ఐ చేరిన యెడల రెండున్ను కలిసి 'ఐ' గాను, ఓ లేక ఔ చేరితే రెండున్ను కలిసి 'ఔ' గాను మారిపోతాయి. ఎలాగంటే -)

एक + एक = एकैक, ఏక + ఏక = ఏకైక

मत + ऐक्य = मतैक्य, మత + ఐక్య = మతైక్య

वन + ओषधि = वनौषधि, వన+ఓషధి = వనౌషధి

परम + औदार्य = परमौदार्य, పరమ+ఔదార్య = పరమౌదార్య

सदा + एव = सदैव, సదా+ ఏవ = సదైవ.

महा + ऐश्वर्य = महैश्वर्य, మహా+ఐశ్వర్య = మహైశ్వర్య
महा + ओज = महौज, మహా+ ఔజ = మహౌజ
महा + औदार्य = महौदार्य, మహా + ఔదార్య = మహౌదార్య

**यण संधि** इ, ई, उ, ऊ, या ऋ के आगे कोई असवर्ण स्वर आये तो इ,ई के स्थान में य, उ, ऊ के स्थान में 'व', ऋ के स्थान मे ' र ' हो जांता है । जैसे–

(**యణసంధి :** ఇ,ఈ,ఉ,ఊ లేక ఋ ల తరువాత ఇదే జాతికి సంబంధించిన అక్షరాలు కాక వేరే అక్షరములు చేరినట్లయితే, ఇ,ఈ, స్థానంలో 'య' గాను; ఉ,ఊ ల స్థానములో 'వ' గాను, 'ఋ' స్థానములో 'ర' గాను మారిపోతాయి. ఉదా :-)

यदि + आपि (యది+అపి) = यद्यपि (యద్యపి)
नि + ऊन् (ని+ఊన్) = न्यून् (న్యూన్)
प्रति + एक (ప్రతి+ఏక) = प्रत्येक (ప్రత్యేక)
सु + आगत (సు+ఆగత్) = स्वागत् (స్వాగత్)
पितृ + अनुमति (పితృ+అనుమతి) = पित्रनुमति (పిత్రనుమతి)
इति + आदि (ఇతి+ఆది) = इत्यादि (ఇత్యాది)
अभि + उदय् (అభి+ఉదయ్) = अभ्युदय (అభ్యుదయ్)
नदि + अर्पण (నది+ అర్పణ్) = नद्यर्पण (నద్యర్పణ్)
अनु + ऐषण् (అను + ఏషణ్) = अन्वेषण् (అన్వేషణ్)
मातृ + आनंद (మాతృ + ఆనంద్) = मात्रानंद (మాత్రానంద్)

**अयादि संधिः** ए,ओ,ऐ,औ, से परे कोई स्वर हो तो ए को अय् . ओ को अव्, ए को आय तथा औ को आव् हो जाता है । जैसे–

(**అయాది సంధి** :- ఎ,ఓ,ఐ,ఔ,కు తరువాత ఏదైనా అచ్చు వచ్చి నట్టయితే 'ఎ' కు అయ్; 'ఓ' కు 'అవ' , 'ఐ' కి ఆయ్; 'ఔ' కు ఆవ్‌గా వస్తాయి. ఎలాగంటే –)

ने + अन = नयन् (నే+అన్ = నయన్)
गै + आक् = गायक् (గై+ ఆక్= గాయక్)
भो + अन् = भवन् (భో+ అన్) = (భవన్)

भो + उक् = भाउक् (భో+ఉక్= భావుక్)
ऊपर - उक्त = उपरोक्त (ఊపర్ + ఉక్త = ఉపరోక్త)

## 2. व्यजन संधि (హల్సంధి)

व्यंजन से स्वर या व्यंजन के आने से व्यंजन में विकार होता है, तब उसे व्यजन संधि कहते हैं।

(హల్సంధి :- హల్లుకు తరువాత అచ్చుగాని, లేక హల్లుగాని వచ్చినట్లయితే . హల్లులో మార్పు వస్తుంది. ఆ మార్పునే హల్సంధి అంటారు. ఎలాగంటే -)

वाक् + ईश = वागीश (వాక్ + ఈశ = వాగీశ)
वाक् + विलास् = वाग्विलास (వాక్ +విలాస్ = వాగ్విలాస్)
वाक् + दान् = वाग्दान् (వాక్ + దాన్ = వాగ్దాన్)
अच + अंत् = अजंत (అచ్ + అంత్ = అజంత్)
अप् + ज = अब्ज (అప్ + జ = అబ్జ)
वाक् + मय = वाङमय (వాక్ + మయ = వాఙ్మయ్)
शट् + मास् = शण्मास् (షట్ + మాస్ = షణ్మాస్)
जगत + नाथ् = जगन्नाथ (జగత్+ నాథ్ = జగన్నాథ్)
जगत् + ईश = जगदीश (జగత్ + ఈశ = జగదీశ)
भगवत् + भक्ति = भगवद्भक्ति (భగవత్ + భక్తి = భగవద్భక్తి)
उत् + गम् = उद्गम् (ఉత్ + గమ్ = ఉద్గమ్).
तत् + रूप = तद्रूप (తత్ + రూప్ = తద్రూప్)
उत् + चारण् = उच्चारण् (ఉత్ + చారణ్ = ఉచ్చారణ్)
उत् + छेद् = उच्छेद् (ఉత్ + ఛేద్ = ఉచ్ఛేద్)
उत् + डयन = उड्डयन् (ఉత్ + డయన్ = ఉడ్డయన్)
विपद् + जाल् = विपज्जाल (విపత్ + జాల్ = విపజ్జాల్)
सत् + जन = सज्जन् (సత్ + జన్ = సజ్జన్)
तत् + लीन = तल्लीन ( తత్ + లీన్ = తల్లీన్)

| | | | | |
|---|---|---|---|---|
| सत् + शास्त्र | = | सच्छास्त्र | (సత్ + శా = సచ్ఛాస్త్ర) |
| उत् + हार | = | उद्धार | (ఉత్ + హార్ = ఉద్ధార్) |

## 3. विसर्ग संधि (విసర్గ సంధి)

विसर्ग के बाद स्वर या व्यंजन के आने पर विसर्ग में जो विकार हेता है, उसे विसर्ग संधि कहते है। जैसे–

(విసర్గ ':' తరువాత అచ్చుగాని, హల్లుగాని వస్తే విసర్గలో జరిగిన మార్పునే విసర్గ సంధి అంటారు. ఎలాగంటే -)

| | | | |
|---|---|---|---|
| निः + चल | = | निश्चल | (నిః + చల్ = నిశ్చల్) |
| धनुः + टंकार | = | धनुष्ठंकार | (ధనుః + టంకార్ = ధనుష్టంకార్) |
| निः + छल् | = | निश्चल् | (నిః + ఛల్ = నిశ్ఛల్) |
| दुः + तर् | = | दुस्तर | ( దుః + తర్ = దుస్తర్) |
| दुः + शासन् | = | दुश्शासन् | (దుః + శాసన్ = దుశ్శాసన్) |
| निः + संदेह | = | निस्संदेह | (నిః + సందేహ్ = నిస్సందేహ్) |
| निः + कलंक् | = | निष्कलंक | (నిః + కలంక్ = నిష్కలంక్) |
| निः + फल | = | निष्फल् | (నిః + ఫల్ = నిష్ఫల్) |
| निः + पाप | = | निष्पाप् | (నిః + పాప్ = నిష్పాప్) |
| दुः + कर् | = | दुष्कर् | (దుః + కర్ = దుష్కర్) |
| निः + आशा | = | निराशा | (నిః + ఆశా = నిరాశా) |
| निः + गुण | = | निर्गुण् | (నిః + గుణ్ = నిర్గుణ్) |
| निः + लज्ज | = | निर्लज्ज | (నిః + లజ్జ = నిర్లజ్జ) |
| निः + विकार् | = | निर्विकार | (నిః + వికార్ = నిర్వికార్) |
| निः + झर् | = | निर्झर | ( నిః + ఝర్ = నిరర్) |
| निः + यात् | = | निर्यात् | (నిః + యాత్= నిర్యాత్) |
| बहिः + मुख | = | बहिर्मुख | (బహిః + ముఖ్ = బహిర్ముఖ్) |
| दुः + लभ | = | दुर्लभ | (దుః + లభ్ = దుర్లభ్) |
| अतः + ऐव | = | अतएव | (అతః + ఏవ = అత ఏవ) |

| | | | | |
|---|---|---|---|---|
| मनः + अभिराम् | = | मनोभिराम | ( మనః + అభిరామ్ = మనోభిరామ్) |
| तेजः + राशि | = | तेजोराशि | ( తేజః + రాశి = తేజోరాశి) |
| अधः + गति | = | अधोगति | (అధః + గతి = అధోగతి) |
| मनः + हर् | = | मनोहर | (మనః + హర్= మనోహర్) |
| पुरः + कार | = | पुरस्कार | (పురః + కార్ = పురస్కార్) |
| नमः + कार | = | नमस्कार | (నమః + కార్ = నమస్కార్) |

# समास (సమాసములు)

परस्पर संबंध रखनेवाले दो या दो से अधिक शब्द मिलकर जब कोई स्वतंत्र शब्द बनाते है, यह मेल समास कहा जाता है और इस प्रकार मिले हुए शबदों को समस्त अथवा सामासिक शब्द कहते हैं । समस्त (समास के) शब्दों के बीच के विभक्ति प्रत्ययों का और संबंध बनानेवाले शबदों का लोप हो जाता है। जैसे - धन का मद = धनमद । घोडे का सवार = धुडसवार। काठ की पुतली = कटपुतली । चंद्र सा मुख = चंद्रमुख।

उक्त शब्दों मिल होकर, समासों के रूप बदल जाते ही, विभक्ति शब्द का, की और संबंध बतानेवाला शब्द सा का लोप हो गया है । समासों के छः भेद हैं -

**1. अव्ययी समास, 2 . तत्पुरुष समास, 3. कर्मधारय समास, 4. द्विग समास, 5. द्वन्द्व समास, . 6. बहुव्रीहि समास।**

(ఒకదానికి మరొక దానితో సంబంధముండు రెండు లేదా రెండు కంటే ఎక్కువ శబ్దాలు కలిసి వేరే రూపములుగా మారినపుడు వాటిని సమాసములు అంటారు. ఈ విధముగా కలిసిన శబ్దాలను సమస్త శబ్దాలని లేదా సామాసిక శబ్దాలని అంటారు. సమాసము ఏర్పడుటకు పూర్వము శబ్దాలు విభక్తులు, సంబంధమున్న శబ్దాలు మొదలైనవి వేరు వేరుగా వుంటాయి. ఆ శబ్దములన్నీ కలిసి సమాస శబ్దమేర్పడునపుడు ఇంతకు ముందు వేరువేరుగా ఉన్న శబ్దాలలోని విభక్తులు, సంబంధమును తెలుపు శబ్దాలు లోపించి పోతాయి. ఎలాగంటే - ధనము యొక్క మదము = ధనమదము; గుఱ్ఱము యొక్క స్వారీ = గుఱ్ఱపుస్వారీ; కొయ్య యొక్క బొమ్మ = కొయ్యబొమ్మ ; చంద్రుని లాంటి ముఖము = చంద్రముఖము.

పై శబ్దముల కలయికతో సమాసము ఏర్పడినపుడు యొక్క. లాంటి శబ్దాలు లోపించిపోయాయి.)

## 1. अव्ययी भाव समास (అవ్యయీ భావ సమాసము)

जिस समास मे प्रथम भाग, जो अक्सर अव्यय (नहीं बदलने वाला) हो प्रधान हो, उसे अव्ययीभाव समास कहते हैं । अव्ययी भाव समास का समस्त शब्द भी अव्यय ही होता है और वाक्य में क्रिया की विशेषता को बताता है ।

जैसे – यथाशक्ति (शक्ति के अनुसार); बेखटके (बाधा के बिना).

उक्त उदाहरणो मे के विभक्ति का लोप होकर अव्ययी भाव समास के रूप हो गये ।

(ఈ సమాసములో ఎక్కువ స్థలాల్లో ప్రథమ భాగములో నున్న అవ్యయము ప్రధాన మయినదిగా వుంటుంది. (అవ్యయమంటే ఎట్టి పరిస్థితులలోను మారనటువంటిది) అవ్యయీ భావ సమాసములోని ప్రథమ భాగములోని పదము ప్రధానమయినదయినా, రెండవ భాగములోని పదము అప్రధానమయినదయినా, అది కూడా అవ్యయము (మారనిది) గానే వుంటుంది. ఈ అవ్యయీ భావ సమాసము వాక్యములోనికి చేరినపుడు, ఇది క్రియా విశేషణమయి క్రియ యొక్క ప్రత్యేకతను తెలుపుతూ ఉంటుంది. ఎలాగంటే –

యధాశక్తి (శక్తిని బట్టి); అడ్డులేకుండా (నిరాటంకముగా) అను అవ్యయీ సమాసములలో యధాశక్తి, అడ్డులేకుండా అనునవి క్రియలకు విశేషణములుగా వచ్చినపుడు, యధాశక్తి చూస్తాను, యధాశక్తి ప్రయత్నిస్తాను, యధాశక్తి పరుగెత్తుతాను అను వాక్యాలలో యధాశక్తి యను అవ్యయీ భావ సమాస మిక్కడ చేస్తాను; ప్రయత్నిస్తాను, పరుగెత్తుతాను, అను క్రియలకు విశేషణమయింది. అడ్డు లేకుండా అను అవ్యయీ భావ సమాసము అడ్డులేకుండా, అడ్డు రాకుండా చేస్తాను అన్నపుడు ఈ అడ్డులేకుండా యను అవ్యయీ భావ సమాసము చేస్తాను అను క్రియకు విశేషణమయింది. ఇలా ఎకాఎకిగా, మనస్సు లోపల, మధ్యమధ్య, తటాలున, అకస్మాత్తుగా, రమారమి మొదలైన వెన్నో సమాసము లుంటాయి. ఈ సమాసములే కొంచెము తేడాలతో హిందీ భాషకు సరిపోతాయి. ఆ భాషలో एका एक (ఎకాఎక్ - వెంటనే), मन ही

मन (మన్ హీ మన్ - మనస్సులోనే) ,बीचोंबीच (బీచోంబీచ్ - మధ్యలో), धडाधड (ధడాధడ్ -వెనుక ముందు లాడకుండా ) అనేవి చాలా వుంటాయి.

## 2. तत्पुरुष समास (తత్పురుష సమాసము)

जिस समास में दूसरा पद प्रधान हो, उसे तत्पुरुष समास कहते है । जैसे चंद्रमुख, राज – सभा, मदमस्त, रसोई धर, पाठशाला, वनवास, अन्याय आदि।

उस समास में, दूसरा शब्द प्रधान होने के कारण, उक्त शब्दों में मुख (ముఖము),सभा (సభ), मस्त ( మత్తు), धर (ఇల్లు), शाला (స్థానము, గది), वास (నివాసము), न्याय (న్యాయము) आदी प्रधान खंड होते हैं।

(అవ్యయీ భావ సమాసములో శబ్దములోని మొదటి భాగము ప్రధానమయితే, ఈ సమాసములో రెండవ భాగము ప్రధానమవుతుంది. ఎలాగంటే - చంద్రముఖము (చంద్రునిలాంటి ముఖము), రాజసభ (రాజు యొక్క సభ), మదమస్త (మదము వలన మత్తెక్కిన ), రసోయీ ఘర్ (వంటయిల్లు), పాఠశాల (పాఠములు చెప్పు చోటు), వనవాసము (వనములో నివసించుట), అన్యాయము (న్యాయము కాకుండుట) అనువాటిలో, రెండవ భాగములయిన ముఖము, సభ, మత్తు, ఇల్లు, స్థలము, నివాసము, న్యాయము అనునవి ప్రధానము లయినందున, అవి తత్పురుష సమాసము లనబడినాయి. తత్పురుష సమాసములో కర్మధారయ, ద్విగు సమాసము లనునవి కూడా వున్నాయి).

### (क) कर्मधारय समास (కర్మధారయ సమాసము)

जिस तत्पुरुष समास के विग्रह में दोनों पदों के बाद एक ही विभक्ति आती है, उसे कर्मधारय समास भी कहते है। इस समास के पद ज्यादातर विशेषण–विशेष्य (నామవాచకము) होते है। जैसे – नीलकमल = नीला कमल (నీలిరంగు కమలము). इस में नीला (నీలిరంగు) विशेषण और कमल (కమలము) विशेष्य (నామవాచ కము) हैं।

महाराज (महान्+राजा= గొప్పరాజు), (पुच्छलतारा పుచ్ఛల్‌తారా = తోక+చుక్క); उन में महा (గొప్ప) विशेषण, राजा (రాజు) विशेष्य (నామవాచకము), पुच्छल (తోక) विशेषण, तारा (తోక) विशेष्य (నామవాచకము) हैं।

(ఈ కర్మధారయ సమాసములోని పదమును విడదీసినప్పుడు, విడదీసిన రెండు పదముల మధ్య ఒక విభక్తి మాత్రమే వుంటుంది. అలాంటి సమాసమును కర్మధారయ సమాసమంటారు. ఈ సమాసములోని పదాలు విశేషణ - విశేష్య (నామవాచక) ములుగా వుంటాయి. ఉదా॥ నీలకమలము (నీలవర్ణపు కమలము) ఇందులో నీలవర్ణపు విశేషణము, కమలము -నామవాచకము మహారాజులో, మహా విశేషణము, రాజు నామవాచకము, తోకచుక్కలో తోక - విశేషణము, చుక్క- నామవాచకము )

## (भ) द्विगु समास (ద్విగు సమాసము)

जिस कर्मधारय समास मे पहला शब्द संख्या वाचक विशेषण हो और जिससे किसी समुदाय का बोध हो, उसे द्विगु समास कहते है। इस मे पहला शब्द सख्यावाचक विशेषण होता है। अतः इसे सख्यावाचक कर्मधारय भी कहते है। जैसे - त्रिभुवन (మూడు లోకములు), चौमास, (चार मास = నాల్గు మాసములు), पंच पाडव (पांच पांडव = ఐదుగురు పాండవులు), षट् ऋतु (छः ऋतु = ఆరు ఋతువులు) आदि ।

(ఈ కర్మధారయ సమాసములో మొదటి శబ్దము సంఖ్యను తెలుపు విశేషణముగా వుండి, ఏదో యొక సముదాయమును తెలుపుచున్నట్లుంటుంది. ఇలా వున్నందున దీనిని ద్విగు సమాసము అన్నారు. ఇందులో మొదటి శబ్దము సంఖ్యను తెలుపు విశేషణముగా వుంటుంది. ఎలాగంటే -

1. మూడు లోకములు - ఇందులో మొదటి 'మూడు' విశేషణము, రెండవ భాగమయిన 'లోకములు' నామవాచకము 2. నాలుగు మాసములు -'నాలుగు' విశేషణము, 'మాసములు' నామవాచకము. ఐదుగురు పాండవులు- 'ఐదుగురు' విశేషణము, 'పాండవులు' నామవాచకము. ఆరు ఋతువులు - 'ఆరు' విశేషణము, 'ఋతువులు' నామవాచకము. ఇలా ఎన్నో వుంటాయి.)

## 3. द्वन्द्व समास (ద్వంద్వ సమాసము)

जिस समास में सब खंड प्रधान होते है और निग्रह करने पर जिस मे और (మరియు), या (లేక), अथवा (లేదా) आदी योजक (समुच्चय बोधक, (Conjunction) लगते हैं । उसे द्वन्द्व समास कहते हैं। जैसे -भला-बुरा (భలా-బురా= మంచిచెడు), ऋषि- मुनि (ఋషి-ముని), दाल -रोटी (దాల్-రోటీ =పప్పు, రొట్టె), हाथ-पांव (హాత్-పాంవ్= చేతులు, కాళ్ళు), तन,मन,धन (తన్-మన్-ధన్ = శరీరము, మనస్సు, ధనము) आदी द्वन्द्व समास बहुत से हैं।

ఈ సమాసములో అన్ని భాగములు ప్రధానమైనవిగానే ఉంటాయి. అయితే విడివిడిగా వ్రాయునపుడు వాటి మధ్యలో మరియు 'లేక' 'లేదా' మొదలైన కలుపుడు శబ్దాలను ఉపయోగించాలి. ఎలాగంటే - మంచి మరియు చెడు, ఋషి లేక ముని, పప్పు మరియు రొట్టె, చేతులు మరియు కాళ్ళు, శరీరము, మనస్సు మరియు ధనము. మనస్సు మరియు వాక్కు. కాని తెలుగులో ఇలాంటి కలుపుడు శబ్దాలయిన - మరియు 'లేక' లేదా వగైరాలు ఎక్కడో తప్ప, చాలా చోట్ల ఉపయోగించబడవు. ఈ శబ్దాలు తెలుగులో ప్రతి చోట చేర్చితే భాష బాణి తప్పిపోతుంది. హిందీలో ఉపయోగించకపోతే, దాని నియమము కుంటుపడుతుంది. తెలుగులో రాముడు, లక్ష్మణుడో ఒకడు అని, కాళ్ళుచేతులని, మంచి చెడులని, మొదలుగా అంటాము. ఋషి-ముని అను చోట్ల ఋషిగాని ముని గాని అనియో ఋషి లేదా ముని అనియో అరుదైన చోట్ల అంటుంటారు.

## 4. **बहुव्रीहि समास** (బహువ్రీహి సమాసము)

जिस समास मे कोई भी शब्द प्रधान नहीं होकर सभी शब्द अपने भागो से अलग, किसी संज्ञा के विशेषण होते है । उन्हे बहुव्रीहि समास कहते हैं । जैसे -

दशकंघर - इसका अर्थ दस सिरवाला है । उस समास के अनुसार यह दस सिरवाला रावण का विशेषण है । अनंत -(అనంత్) का अर्थ है, जिसका अन्त नहीं है, मगर यहाँ ईश्वर का विशेषण है। अनग - इसका अर्थ है, अग नहीं रहनेवाला, मगर यहाँ कामदेव का नाम है। बारहसिंगा - उसका अर्थ है, बारह सींगवाला (పన్నెండు కొమ్ముల దుప్పి). पजाब - उसका अर्थ है, जिस में पाँच नदियाँ है (ఎక్కడ అయిదు నదులున్నాయో, అది పంజాబు అని యర్థము).

मिठबोल का अर्थ है - मीठा बोलनेवाला (తియ్యని పలుకులు పలికేవాడు)

कर्मधारय और बहुव्रीहि समास में यह फरक है कि कर्मधारय में पूरे शब्द का पहला भाग, दूसरे भाग का विशेषण होता है। मगर बहुव्रीहि समास मे सारे पूरे शब्द अपने भागो से अलग, किसी और शब्द का विशेषण होता है । बहुत से समस्त शब्द अर्थ-भेद से अलग-अलग तरीके के समास होते है । जैसे - (1) मृगलोचन - मृगलोचन (संबंध तत्पुरुष - లేడికళ్ళు)

(2) मृगलोचन –मृग के समान लोचनों वाला (లేడికన్నుల వంటి కనులు కలవాడు.)
(3) पीतांबर–पीला कपडा (పసుపు గుడ్డ) బహువ్రీహి (कर्मधारय) కర్మధారయ(4) पीताबर – पीला कपडा पहना व्यक्ति (कृष्णा) (बहुव्रीहि– బహువ్రీహి).

कई बार सारे शब्द में कई समास होते है । किंतु पूरे शब्द के अन्त का समास अव्वल होता है । जैसे – राकेदुबिंबानना, यह पद राका+इन्दु+बिम्ब+आनन (రాకా+ఇందు+బింబ+అనన) इन चार शब्दों के मिलन से बना है । राका का इंदु = राकेंदु (పూర్ణచంద్రుడు), राकेंदु का बिंब = राकेदु बिंब, राकेंदु बिंब के समान जिसका आनन (मुख– ముఖము) है, वह स्त्री राकेंदुबिंबानना होगी। उस पुकार, पूरा शब्द बहुव्रीहि समास है ।

(ఈ సమాసములో ఏ శబ్దము కూడా ప్రధానమయినది కాదు. అక్కడ నున్న పూర్తి శబ్దములోని వేరు వేరు భాగాలు కలిసి మరొక నామవాచకానికి విశేషణ మవుతుంది. ఎలాగంటే - దశకంధరుడు - అను శబ్దమున్నది. దీని పదముల యర్థము పదితలలు గలవాడు. కాని యిక్కడ ఈ దశకంధరుడను శబ్దము రావణుడు అను నామవాచకమునకు విశేషణ మవుతుంది. మరొక శబ్దము 'అనంగుడు'. ఈ శబ్దార్థము అంగములు లేనివాడు. కాని ఇది 'మన్మధుని 'పేరు. హిందీలో దుప్పి పేరు బారహ్‌సింగా. దీని అర్థము 'పన్నెండు కొమ్ములు' గలదియని. అయితే 'పన్నెండు కొమ్ములు' దుప్పియను నామవాచకమునకు విశేషణమయింది. మనము పంజాబు అంటుంటాము. అంటే దాని అసలు అర్థము ఐదు నదులు గలది. అయితే బహువ్రీహి సమాస ప్రకారము పంజాబు అను నామవాచకానికి, ఐదు నదులు గలది విశేషణము. ఇలా ఎన్నో సమాసాలున్నాయి.

కర్మధారయ, బహువ్రీహి సమాసములలో తేడా ఏమిటంటే, కర్మధారయ సమాసములో మొత్తము శబ్దము యొక్క మొదటి భాగము, రెండవ భాగానికి విశేషణమవుతుంది. కాని బహువ్రీహి సమాసములో శబ్దము మొత్తములో నున్న భాగాల అర్థాలకు వేరుగా, ఏదో మరొక క్రొత్త విశేషణము వస్తుంది. అనేక శబ్దాలు అర్థభేదముల వలన రకరకాల సమాసములుగా మారిపోతుంటాయి. ఎలాగంటే - 1. మృగలోచన అంటే అర్థము - లేడి కళ్ళు (ఇది సంబంధమును తెలుపు తత్పురుష) 2. మృగలోచన - లేడికళ్ళలాంటి కళ్ళు గలవాడు, కలది(బహువ్రీహి) 3. పీతాంబరము - పసుపు గుడ్డ (కర్మధారయ సమాసము) 4. పీతాంబరుడు - పసుపు వస్త్రము ధరించిన వ్యక్తి - కృష్ణుడు (బహువ్రీహి).

అనేకసార్లు ఒక పూర్ణ శబ్దములో అనేక సమాసాలు వుంటాయి. కాని పూర్తి శబ్దమునకు చివరనున్న సమాసమే ముఖ్యమని భావించబడుతుంది. ఎలాగంటే - 'రాకేందు బింబాననా' యను శబ్దములో రాకా+ఇందు+బింబ+అనన యను నాలుగు శబ్దాల కలియిక వుంది.

